# విశ్వకోశము

## ( విశ్వ ప్రకాశము )



## సంస్కృతాంధ్ర నిఘంటువు

కోశ కర్త :

శ్రీ మహేశ్వర సూరి



రోహిణి పబ్లికేషన్స్

మెయిన్ రోడ్, రాజమండ్రి - 1.

# VISWA KOSAM

(VISWA PRAKASAM)

By : **SRI MAHESWARA SURI**

SANSKRIT - TELUGU DICTIONARY



First Edition :
OCTOBER 1996

DTP at :
**UNIVERSAL TYPE SETTERS,** Rajamundry.

Printed at :
**SRI ARUNODAYA PRINTING PRESS,**
**Seetharampuram, VJA-2. Ph : 431422**

*Published by :*

**Phone : 73444**

**ROHINI PUBLICATIONS**

**MAIN ROAD, RAJAMUNDRY - 1**

**PRICE : Rs.75/-**

# మనవి

సంస్కృత శబ్దకోశాల్లో అమరకోశం తర్వాత ఎన్నదగినది విశ్వకోశం.

శ్లో : కోశం విశ్వ ప్రకాశాఖ్యం నిరమాచ్చీ మహేశ్వరః

అనే శ్లోకాన్ని బట్టి సమస్తమును ప్రకాశింపజేయబడినది'' అనే అర్థం స్ఫురించే విధంగా కోశకర్త శ్రీ మహేశ్వర సూరి ఈ నిఘంటువుకు ''విశ్వప్రకాశము'' అన్న ఔచిత్యనామాన్ని ఏర్పరచాడు. కాని సంజీవినీ వ్యాఖ్యాత శ్రీ మల్లినాథ సూరి తన వ్యాఖ్యానాలలో ఉచ్చారణ సౌలభ్యం కొరకు ''ఇతి విశ్వః'' అని పేర్కొనటంతో దీనిపేరు విశ్వకోశంగానే స్థిరపడిపోయింది.

ప్రామాణిక పరంగా పరిశీలిస్తే రమారమి పది నిఘంటువులను సంప్రదించి నిర్మించటం వలన శబ్ద బాహుళ్యత, సౌష్ఠవాలను సంతరించుకుని సప్రామాణిక నిఘంటువుగా నేటికీ నిలువగలిగింది.

శ్లో : ఏతత్కవీంద్రైరథ పండితేంద్రైః ప్రయోగ సంబోధ ఫల ధ్వయాప్త్యై
యైర్నామ కంఠాభరణం కృతంత్తైః సర్వజ్ఞతా స్వప్రణయా కృతైవ

అనే శ్లోకాన్ని ప్రయోజన పరంగా పరిశీలిస్తే ఈ విశ్వకోశం కవీంద్రులకు, పండితులకు, విద్యార్థులకు మిక్కిలి మహోపకారిగా అవగతమవుతోంది.

ఇటువంటి అత్యుత్తమమైన నిఘంటువును విద్వాంసులు, విద్యార్థులు ఆదరిస్తారనీ, విశ్వప్రకాశంతో విద్యార్థులు స్వయం ప్రకాశితులు అవశ్యం కాగలరని ఆశిస్తున్నాం.

ధాతృనామ సంవత్సరం
విజయ దశమి

రోహిణి పబ్లికేషన్స్.

## ఈ నిఘంటువునందు సూచించిన సంకేతములు

| | | |
|---|---|---|
| పు | ..... | పుంలింగము |
| స్త్రీ | ..... | స్త్రీలింగము |
| న | ..... | నపుంస లింగము |
| త్రి | ..... | త్రిలింగము |
| అ | ..... | అవ్యయము |

# విశ్వకోశః

## ముఖఖండ ప్రారంభః

స్తువీ మహి మహామోహక్లేశాంతక భిషగ్వరం।
త్రైధాతుకనిదానజ్ఞం సర్వజ్ఞం దుఃఖహానయే॥ 1

కలావిలాసాత్మకరందబిందు ముద్రాం వినిద్రే హృదయారవిందే।
యా కల్పయంతీ రమతే కనీనాం దేవీం నమస్యామి సరస్వతీం తాం॥ 2

కవీంద్రకుముదానంద కందోద్గమసుధాకరం।
వాచస్పతిమతి స్పర్ధి శేముషీ చంద్రికోజ్వలం॥ 3

ముఖ్యత్క్షీరాబ్ధికల్లోలమాలోల్లాసి యశశ్శ్రియం।
గురుం వందే జగద్వంద్య గుణరత్నైక రోహణం॥ 4

శ్రీసాహసాంకనృపతే ర నవద్యవైద్య విద్యాతరంగ పదమద్వయమేవ బిభ్రత్।
యశ్చంద్రచారుచరితో హరిచంద్రనామా స్వవ్యాఖ్యయా చరకతంత్రమ లంచకార॥ 5

ఆసీద సీమ వసుధాధిప వందనీయే తస్యాన్వయే సకల వైద్యకులావతంసః।
శక్ర స్య దస్ర ఇవగాధిపురాధిపస్య శ్రీ కృష్ణ ఇత్యమల కీర్తిలతావితానః॥ 3

సంకల్ప నంభవదనల్ప వికల్పజల్ప కల్పాన లాకులిత వాదిసహస్ర సింధుః।
తర్క త్రయత్రిణయన స్తనయో యదీయో దామోదర స్సమభవద్భిషజాం వరేణ్యః॥ 7

తస్యాభవత్సూ నురుదారవాచో వాచస్పతి శ్రీలలనావిలాసీ।
సద్వైద్య విద్యానళినీదినేశః శ్రీమల్లణ స్సత్కుముదాకరేందుః॥ 8

యద్భ్రాతృజ స్సకలవైద్యక తత్వరత్న రత్నాకర శ్రియమవాప్య చ కేశవో భూత్।
కీర్తేర్నికేతన మనింద్యపదప్రమాణ వాక్య ప్రపంచరచనా చతురాననశ్రీః॥ 9

కృష్ణస్య చాస జని సుత స్స్మితపుండరీక షండాతపత్ర పరభాగయశః పరాగః।
శ్రీ బ్రహ్మ ఇత్యవికలాత్మ ముఖారవింద సోల్లాసలాసిత రసార్ద్ర సరస్వతీకః॥ 10

తస్యాత్మజ స్సరసకైరవ కాంతకీర్తిః శ్రీమాన్మహేశ్వర ఇతి ప్రథితః కవీంద్రః।
నిశ్శేషవాఙ్మయ మహార్ణవపారదృశ్వా శబ్దాగమాంబురుహ షండరవిర్బభూవ॥ 11

య స్సాహసాంకచరితాది మహాప్రబంధ నిర్మాణనైపుణగుణాగత గౌరవశ్రీః।
యో వైద్యకత్రయ సరోజ సరోజబంధుః బంధు స్సతాం సుకవికైరవ కాననేందుః॥ 12

ఇయం కృతి స్తస్య మహేశ్వరస్య వైదగ్ధ్యసింధోః పురుషోత్తమానాం।
దేదీప్యతాంహృత్కమలేషు నిత్య మాకల్ప మాకల్పిత కౌ స్తుభశ్రీః॥ 13

లబ్ధైః కథంచిదఖిజాత సువర్ణకార లీలేన కోశవరరత్నధి శబ్దరత్నైః।
విశ్వప్రకాశ ఇతి కాంచనబంధ శోభాం బిభ్రన్మయా త్రఘటితో ముఖఖంధ ఏషః॥ 14

క్షోణీశ్వరో దీరితశబ్దకోశ రత్నాకరాలోడనలాల సానాం।
సేవ్యః కథం నైష సువర్ణ శైలో విశ్వప్రకాశో విబుధాధిపానాం॥ 15

భోగీంద్ర కాత్యాయన సాహసాంక వాచస్పతి వ్యాడి పురస్సరాణాం।
సవిశ్వరూపా మలమంగలానాం శుభాంగ వోపాలిత భాగురాణాం॥ 16

కోశావకాశాత్ప్ర కటు ప్రభావ సంభావితా నర్ఘ్యగుణస్స ఏషః।
సంపాదయ న్నేష్యతి వాంఛితార్థా కథం న చింతామణితాం కవీనాం॥ 17

ఆమిత్రశైల చరమాచలమే (క) ఖలాద్రి కైలాసభూమి వలయాద్య దిహాస్తికించిత్।
ఏకత్ర సంభృతమగోచర శబ్దరత్న మాలోక్యతాంత దఖిలం సుధియః కవీంద్రాః॥ 18

యద్యస్తి వాఙ్మయమహార్ణవ మంథనేచ్ఛా ప్రాప్తుం పదం ఫణి పతేర్యది కౌతుకం వః।
విశ్వప్రకాశమనిశం తదిమం నిషేవ్య సంభావ్య తాం పరమశాబ్దిక శేఖరశ్రీః॥ 19

సతాం పుస్తక సంభారభార మోక్షః కృతో మయా।
నామానుశాసనమిదం సంపూర్ణం తన్వతాఽద్భుతం॥ 20

యద్యపూర్వతయా కించిన్నామాత్ర ప్రతిభాతి చ।
తత్తదన్విష్యతాం సద్భిర్నామ పారాయణాదిషు॥ 21

ఏతత్కవీంద్రై రథ పండితేంద్రైః ప్రయోగ సంబోధ ఫలద్వయాప్త్యై।
యైర్నామ కంఠాభరణం కృతం తై స్సర్వజ్ఞతా స్వప్రణయా కృతైవ॥ 22

స్వైరప్రచారైః పరికల్పితాభిః శబ్దార్థ సంబోధ కథా ప్రథాభిః।
వ్యాఖ్యాభి రప్రాప్తముదాం ప్రమోదమాదాతు మత్రైష పరిశ్రమోనః॥ 23

ఏతాంకృతిం కృతధియః కృతకృత్యభావ మాపాదయన్ను సదయం సదయంతు చేతః।
నిత్యం మహేశ్వరకవేః పరిభావయంతః సంతః పరోన్నతిరతా హి భవంతి లోకే। 24

రామా నల వ్యోమ రూపైశ్శకకాలే ఖిలక్షితే కోశం విశ్వప్రకాశాఖ్యం నిరమాచ్ఛీ మహేశ్వరః॥ 25

# నియామాః

**మూ :** ఏకద్వి త్రి చతుః పంచ షడ్వర్ణాను క్రమోజ్జ్వలైః
కాంతాదివర్గైర్నానార్థసంగ్రహోఽయం వితన్యతే 1

**టీ.** ఏక ... జ్జ్వలై - ఏక ... షట్ = ఒకటి మొదలుకొని యారు వరకు నైన, వర్ణ = అక్షరముల యొక్క, అనుక్రమ = వరుసచేత, ఉజ్జ్వలైః = ప్రకాశించుచున్న, కాంతాది వర్గైః = కాంతము మొదలగు వర్గములచేత, అయం = ఈ, నానార్థసంగ్రహః = అనేకార్థ సంగ్రహము, వితన్యతే = విస్తరింపబడుచున్నది.

**మూ :** నానార్థః ప్రథమాంతోఽత్ర సర్వత్రాదౌ ప్రదర్శితః
సప్తమ్యంతేషు శబ్దేషు వర్త మాన స్సునిశ్చితః 2

**టీ :** అత్ర = ఈ కోశమునందు, సర్వత్ర = అంతట, సప్తమ్యంతేషు = సప్తమీ విభక్తి యంతమందుగల, శబ్దేషు = శబ్దములయందు, వర్తమానః = వర్తించు చున్నయదియు, సునిశ్చితః = సుష్టుగానిశ్చయింపబడినదియు, ప్రథమాంతః = ప్రథమావిభక్తియంతమందుగలదియు( నగు) నానార్థః = అనేకార్థశబ్దము, ఆదౌ= ముందుగా, ప్రదర్శితః = చూపబడెను.

**మూ :** దృష్టాంతేన సహ క్వాపి సప్తమ్యాధార ఏవ చ
స్పష్టాయ లింగభేదాయ క్వాప్యత్ర పునరుక్తతా 3

**టీ :** క్వాపి = ఒక్కొక్కచోట, దృష్టాంతేన సహ=దృష్టాంతముతోగూడా సప్తమ్యాధారఏవ = సప్తమీ విభక్తి యాధారముగల శబ్దము నందే ( ప్రవర్తించు చున్నది) ఉ : శ్లో 'దవో దావ ఇవ ఖ్యాతో దవాగ్ని వనయోరపి' అత్ర = ఈ కోశమునందు, క్వాపి= ఒక్కొక్కచోట, పునరుక్తతా = ( నానార్థపదముయొక్క) పునరుచ్చారణము, స్పష్టాయ = స్పష్టమైన, లింగభేదాయ = లింగవిభేదము కొఱకు (నగుచున్నది)

★ కాంత ఏకవర్ణః ★

కొ బ్రహ్మాత్మా నిలార్కేషు
శమనే సర్వనామ్ని చ
పావకే చ మయూరేచ
సుఖ శీర్షజలేషు కం

**క :** పు. ఇది బ్రహ్మకును, ఆత్మకును, వాయువునకును, సూర్యునకును, యమునకును, సర్వనామవాచకముకును, అగ్నికిని, నెమలికిని, న. సుఖమునకును, శిరమునకును, జలమునకును పేరు.

★ అథ కాంతోద్వివర్ణః ★

అకం పాపే చ దుఃఖేచ
శకో రాజన్య దేశయోః

**అక :** న. ఇది పాపమునకును, దుఃఖమునకును పేరు. **శక:** పు. ఇది రాజశ్రేష్ఠునకును, (శాలివాహనాదులు) దేశవిశేషమునకును పేరు.

బకస్తు బకపుష్పే స్యా
త్కాహ్వే శ్రీదే చ రక్షసి
శుకో వ్యాససుతే కీరే
రావణస్యచ మంత్రిణి
గ్రంథిపర్ణే శిరీషే చ
శుకం స్యాచ్ఛోణకే క్వచిత్
ద్వికః కాకే చ కోకే చ
సృకో బాణానిలోత్పలే

**బక:** పు. ఇది బకపుష్పపుచెట్టునకును, వాలుకొంగకును, కుబేరునకును, బకాసురునకును పేరు.
**శుక :** పు. ఇది శుకమహామునికిని, చిలుకకును, రావణుని మంత్రికిని, న. స్థాణేయమను గంధద్రవ్యమునకును, దిరిశనచెట్టునకును, దుండిగపుచెట్టునకును పేరు.
**ద్విక :** పు. ఇది కాకికిని, చక్రవాక పక్షికిని పేరు.
**సృక:** పు. ఇది బాణమునకును, వాయువునకును, కలువకును పేరు.

అర్కోఽర్కపర్ణే స్ఫటికే
రవౌ తామ్రే దివస్పతౌ(7)
కర్కః కర్కే రాశిభేదే
శుక్లాశ్వేదర్పణే ఘటే
తర్కః కాంక్షావితర్కోహ
కర్మభేదేషు కీర్త్యతే
శ్లోకో యశసి పద్యే చ
లోకస్తుభువనే జనే
స్తోకోఽల్పే చాతకే

**అర్క :** పు. ఇది జిల్లేడుచెట్టునకును, స్ఫటికమణికిని, సూర్యునకును, రాగికిని, ఇంద్రునకును పేరు.
**కర్క :** పు. ఇది పీతకును, కర్కాటక రాశికిని, వెల్ల గుఱ్ఱమునకును, అద్దమునకును, కుండకును పేరు.
**తర్క :** పు. ఇది ఆశకును, సంశయ వితర్కమునకును, ఊహకును, కర్మవిశేషమునకును పేరు.
**శ్లోక :** పు. ఇది కీర్తికిని, పద్యమునకును పేరు.
**లోక :** పు. ఇది లోకముకును, మనుజునకును పేరు. **స్తోక :** త్రి. ఇది స్వల్పమైనదానికిని, పు. వానకోయిలకును పేరు.

తోకం త్వపత్యే తనయే పిచ॥(9)

**తోక** : న. ఇది స్త్రీ పుంరూప సంతానమునకును, పుత్రునకును పేరు.

కోకశ్చక్రేవృకే జ్యేష్ట్యం
ఖర్జూరీద్రుమ భేకయోః।

**కోక**: పు. ఇది చక్రవాకపక్షికిని, తోడేటికిని, ఖల్లికిని, ఖర్జూరపుచెట్టునకును, కొంగకును పేరు.

రోకో దీప్తౌ బిలే రోకం
నౌకా క్రయణభేదయోః॥

**రోక** : పు. ఇది ప్రకాశమునకును, న. రంధ్రమునకును, ఓడకును, కొనుటకును పేరు.

ఛేకో విదగ్ధే ఛేకస్తు
విశ్వస్తమృగ పక్షిణోః।

**ఛేక** : త్రి. ఇది నేర్పరికిని, విశ్వసింపజేయబడిన మృగపక్ష్యాదులకును పేరు.

రేకో విరేకే శంకాయాం
రేక స్స్యాదవమేఽపి చ॥

**రేక** : పు. ఇది విరేచనమునకును, శంకకును, నీచునకును పేరు.

కాక స్స్యాద్వాయసే.వృక్ష
ప్రభేదే పీఠసర్పిణి।
కాకా స్యాత్కాకనాసాయాం
కాకోలీ కాక జంఘయోః॥(12)
రక్తికాయాం మలయ్యాంచ
కాకమాచ్యాంచ కీర్తితా।
కాకం స్త్రీరత బంధే స్యా
త్కాకానాం సంహతావపి॥(13)
వేశవారేచ ధృష్టే చ జ్యేష్ఠే చ
క్వచిదిష్యతే శిరోఽవ క్షాలనే।
మానవిశేష ద్వీపభేదయోః॥(14)

**కాక**: పు. ఇది కాకికిని, కొండగోగుచెట్టునకును, కుంటివానికిని, స్త్రీ. కాకిదొండచెట్టునకును, తేలుమణిచెట్టునకును, వెలుమసంధిచెట్టునకును, కాచిచెట్టునకును, న. స్త్రీల రతిబంధవిశేషమునకును, కాకులసమూహమునకును, సంబారపుగుండకును, దిట్టరికిని, వృద్ధునకును, తలరుద్దుకొనుటకును, పరిమాణభేదమునకును, ద్వీపభేదమునకును పేరు.

పాకశ్శిశౌ జరానిష్ఠౌ
పచన క్లేదనే షు చ।

**పాక**: పు. ఇది పిల్లవానికిని, ముసలితనమునకును, వండుటకును, పండుటకును పేరు.

శాకో ద్వీపాంతరే శక్తౌ
నృప ద్రుమవిశేషయోః॥ (15)
శాకం హరీతకే చాపి

**శాక** : పు. ఇది శాకద్వీపమునకును, సామర్థ్యమునకును, శాకరాజునకును, శాకవృక్షమునకును, కరకచెట్టునకును పేరు.

నాకస్స్వర్గాంతరిక్షయోః।

**నాక**: పు. ఇది స్వర్గమునకును, ఆకాశమునకును పేరు.

మూకోఽపవాక్చ్యుతౌ దీనే

**మూక** : పు. ఇది మూగవానికిని, దీనునకును పేరు.

| | |
|---|---|
| శూకోనుక్రోశ శృంగయోః॥(16) | **శూక**: పు. ఇది దయకును, క్రొమ్ముననకును పేరు. |
| భూక శ్ఛిద్రే మరాళే చ | **భూక** : పు. ఇది రంధ్రమునకును, హంసకును పేరు. |
| భేకో మండూక మేఘయోః। | **భేక** : పు. ఇది కప్పకును, మబ్బునకును పేరు. |
| ఏకంతు కేవలే శ్రేష్ఠ ఇతరస్మింశ్చ వాచ్యవత్॥ | **ఏక** : త్రి. ఇది అసహాయమ్మైనదానికిని, శ్రేష్ఠమైన దానికిని, వేరైనదానికిని పేరు. |
| శౌకం శుకసమూహేచ స్త్రీణాం చ కరణాంతరే। | **శౌక** : న. ఇది చిలుకల గుంపునకును, స్త్రీల రతి బంధవిశేషమునకును పేరు. |
| అంకస్స్వాన్తే ంతికే మంతౌ రూపకో. త్సంగలక్ష్మసు॥(18) నాటకాది పరిచ్ఛేదే చిత్రయుద్ధేచ భూషణే। | **అంక** : పు. ఇది ప్రదేశమునకును, సమీపమున కును, అపరాధమునకును, నాటక విశేషమున కును, తొడముందరి భాగమునకును, చిహ్నమున కును, నాటకమందలి భాగమునకును, యుద్ధవి శేషమున కును, అలంకారమునకును పేరు. |
| కంకశ్ఛద్మద్విజే ఖ్యాతో లోహపృష్ఠ కృతాంతయోః॥(19) | **కంక**: పు. ఇది బ్రాహ్మణవేషధారునకును, రాపులు గునకును, యమునకును పేరు. |
| వంకః పల్యాణభాగే స్యా న్నదీపాత్రే చ భంగురే। | **వంక**: పు. ఇది గుఱ్ఱపు కళ్ళెము యొక్క ముందరి భాగమునకును, నదీవక్రమునకును పేరు. |
| టంకః కపిత్థభేదే స్యా న్మానాంతర ఖనిత్రయోః॥(20) కోపేఽసికోశే జంఘాయాం టంకణె గ్రావధారణే। | **టంక**: పు. ఇది నల్లవెలగచెట్టునకును, రెండుధరణ ముల ప్రమాణమునకును, తవుగోలకును, కోప మునకును, కత్తివరకును, పిక్కకును, వెలిగార మునకును, ఱాళ్ళుమలచెడు యులికిని పేరు. |
| రంకస్తు కృపణే మల్లే | **రంక** : పు. లోభికిని, జట్టివానికిని పేరు. |
| పంకః కర్దమ పాపయోః॥ | **పంక** : పు. ఇది బురదకును, పాపమునకునుపేరు. |
| న్యంకు ర్మృగే ఋషౌ | **న్యంకు**: పు. ఇది జింకపోతునకును, ముని విశేషము నకును పేరు. |
| నాకు ర్వామలూరౌ మునౌ గిరౌ। | **నాకు**: పు. ఇది పుట్టకును, మునివిశేషమునకును, పర్వతమునకును పేరు. |
| శంకుః కీలే శివేఽస్త్రే చ సంఖ్యాపాదపభేదయోః॥ | **శంకు**: పు. ఇదిమేకునకును, శివునకును, అస్త్రవి శేషమునకును, సంఖ్యాభేదమునకును, వృక్షవిశే |

| | |
|---|---|
| యాదొ భేదేచ పాపేచ | షమునకును, నీటిపందికిని, పాపముకును, |
| స్థాణావపి చ మేహనే। | కొమ్ములులేనిమొరడుకును, శిశ్నముకును పేరు. |
| కల్కః పాపాశయె పాపే | **కల్క** : పు. ఇది దురాలోచనకును, పాపముకును, |
| దంభె విట్కిట్టయోరపి॥ | కపటముకును, పురీషమునకును, చీమిడిమొదలగు పం(డెండు విధములగు శారీరమలములకును పేరు. |
| వల్కంతు వల్కలె ఖండె | **వల్క** : పు. ఇది నారపట్టకును, తునుకకును పేరు. |
| శల్కం శకలవల్కయోః। | **శల్క** : పు. ఇది తునుకకును, నారపట్టకును పేరు. |
| శుల్కం ఘట్టాది దెయెస్యా | **శుల్క** : పు. ఇది మార్గస్థులు ఘాటీల వద్దనిచ్చు |
| జ్జామాతుర్భంధకేఽపి చ॥ (24) | (ద్రవ్యమునకును, అల్లునివద్దపుచ్చుకొను (ద్రవ్యముకును పేరు. |
| నిష్కమష్టాధిక స్వర్ణ | **నిష్క** : పు. ఇది 108 స్వర్ణముల యెత్తు బంగారు |
| శతెదీ నారకర్షయోః। | నాణెమునకును, 70 గురుగింజలయెత్తు ము(ద్రికకును, కర్షమునకును, వక్షమున ధరించు పతకమున |
| వక్షాలంకరణె హెమ | కును, బంగారమునకును, పలముయెత్తు బంగారమునకును పేరు. |
| మాత్రె హెమపలెఽపిచ॥(25) | |
| ముష్కోఽండ కోశె సంఘాతె | **ముష్క** : పు. ఇది వృషణముకును, సమూహమున |
| ముష్కొ మోక్షేచ పాదపె। | కును, మోక్షముకును, వృక్ష విశేషముకును పేరు. |
| కిష్కుర్వితస్తౌ హస్తెచ | **కిష్కు** : పు. ఇది జానకును, మూరకును, ముంజే |
| ప్రకోష్ఠె కుత్సితె ఽ పి చ॥ (26) | యికిని, నిందితునకును పేరు. |
| త్రికాకూపస్య నెమౌస్యా | **త్రికా** : స్త్రీ. ఇది నూతిమీది గిరుకకును న. ముడ్డి |
| త్త్రికం పృష్ఠాధరె త్రయె। | పూసకును, మూడు వస్తువులసమూహముకును పేరు. |
| లంకా రక్షఃపురీశాఖా. | **లంకా** : స్త్రీ. ఇది రావణుని పట్టణమునకును, |
| శాకినీ కులటాసుచ॥ (27) | కొమ్మకును, శాకినీ భూతమునకును, వ్యభిచారిణికిని పేరు. |
| శంకా త్రాసె వితర్కెచ | **శంకా** : స్త్రీ. ఇది భయమునకును, సందేహించుటకును పేరు. |
| రాకాతు సరిదంతరె। | **రాకా** : స్త్రీ. ఇది నదీ విశేషముకును, గజ్జికిని, |

| | |
|---|---|
| కచ్చూనవరజఃకన్యా<br>పూర్ణేందుపూర్ణి మాసుచ॥(28) | క్రొత్తగా రజస్వలయైన పడుచుకును, నిండుపున్న మకును పేరు. |

★ అథకాంత త్రీవర్గః ★

| | |
|---|---|
| కనకం చంపకె స్వర్ణె<br>కింశుకె నాగకెసరె।<br>దుత్తూరె కాంచనారెచ<br>కాలెయెూ౽పి క్వచిన్మతం॥ (29) | **కనక** : న. ఇది సంపెంగ పువ్వుకును, బంగారుకును, మోదుగచెట్టుకును, నాగకేసర వృక్షముకును, ఉమ్మెత్త చెట్టుకును, దేవకాంచన వృక్షమునకును, కృష్ణాగరుకును పేరు. |
| కరకస్తు కరంకెస్యా ద్దాడి<br>మెచ కమండలౌ పక్షిభెదె<br>కరెచాపి కరకాచ ఘనోపలె॥ | **కరక** : పు. ఇది పుర్రెకును, దానిమ్మ చెట్టుకును, కమండలమునకును, కరక పక్షికిని, హస్తమునకును, స్త్రీ. వడగలికిని పేరు. |
| నరకొనిరయె దైత్యె | **నరక**:పు. ఇది నరకముకును, నరకాసురునకును పేరు. |
| సరకస్సీధుభాజనె।<br>అభిన్నాధ్వగపంక్తౌచ<br>సీధుపానెచ సీధుని॥(31) | **సరక** : పు. ఇది కల్లుకుండకును, ఎడతెగని మార్గస్థుల వరుసకును, కల్లుత్రాగుటకును, కల్లుకును పేరు. |
| ఖనక శ్చిత్తతత్వజ్ఞె సంధి<br>(పథి) చొరెచ మూషకె। | **ఖనక** : పు. ఇది చిత్తతత్వముందెలిసిన వానికిని, కన్నపు దొంగకును, పందికొక్కుకును పేరు. |
| జనకః పితృ రాజర్ష్యో | **జనక**: పు. ఇదితండ్రికిని, జనకమహారాజుకును పేరు. |
| ర్యుతకం సంశయె యుగె॥<br>యౌతకె చలనాగ్రెచ స్త్రీ<br>వస్త్రాంచలయుక్తయోః। | **యుతక**: న. ఇదిసంశయమునకును, జంటకును, పెండ్లికూతునకిచ్చు బాలతొడవుకును, చాటకొనకును, స్త్రీలపైటచంగుయొక్క అగ్రముకును, కూడుకొన్న దానికిని పేరు. |
| కృషకః కర్షకెఫాలె (పాపె) | **కృషక** : పు. ఇది దున్నుకొని జీవించు వానికిని, నాగటి కర్రుకును పేర్లు. |
| రజకొ ధావకె శుకె॥(33) | **రజక**: పు. ఇది చాకలి వానికిని, చిలుకకును పేరు. |
| మధుకొ వందిభెదెస్యా<br>ద్యష్ట్యాహ్వె విహగాంతరె।<br>మధుకొ మధుపర్ణ్యాంస్యా | **మధుక** : పు. ఇది స్తుతి పాఠకునకును, యష్టిమధుకముకును, పక్షివిశేషముకును, తిప్పతీగెకును పేరు. |
| దణుకొ నిపుణాల్పయోః॥(34) | **అణుక**: పు. ఇది నేర్పరికిని, అల్పునకును పేరు. |

వసుకశ్శివమల్యాం స్యా
దర్కపర్ణే చ రోమకే।

**వసుక** : పు. ఒక పుష్పపు చెట్టుకును, జిల్లేడు చెట్టుకును, రుమాకరపాంసులవణముకును పేరు.

శిశుకశ్శింశుమారేస్యా
ద్వాలకోలూపినోరపి॥(35)

**శిశుక** : పు. ఇది పిడక మొసలికిని, శిశువుకును, ఉలుచమీనుకును పేరు.

క్రముకః పట్టికా లోధ్రే
భద్రముస్తక పూగయోః।
ఫలేకార్పాసికాయాంచ
క్రముకో బ్రహ్మదారుణి॥(36)

**క్రముక** : పు. ఇది యెర్రలొద్దుగ చెట్టుకును, భద్రతుంగముస్తకును, పోకచెట్టుకును, ప్రేంకణపు చెట్టుకును, ప్రత్తిచెట్టుకును, గంగరావిచెట్టుకును పేరు.

బహుకః కర్కటేఽర్కేచ
దాత్యూహె జలఖాతకే।

**బహుక** : పు. ఇది పీతకును, జిల్లేడు చెట్టుకును, కూకురు గడ్డంగి పిట్టకును, సంగడికిని పేరు.

ధనిక స్సాధుధన్యాక
ధవేషు ధనికాస్త్రియాం॥ (37)

**ధనిక** : పు. ఇది సజ్జనునకును, ధనియముకును, పెనిమిటికిని, స్త్రీ. ఆడుదానికిని పేరు.

ప్రియకః పీతసారేస్యా
న్నీపె చిత్రమృగేఽళినీ।
కుంకుమెచ ప్రియంగౌచ

**ప్రియక** : పు. ఇదిపేగిమ్రానునకును, కడిమిచెట్టుకును, పలురంగుల వెంట్రుకలు గల ఇఱ్ఱికిని, తుమ్మెదకును, కుంకుమకును, ప్రేంకణపు చెట్టు కునుపేరు.

పృథుకశ్చిపిటె శిశౌ॥ (38)

**పృథుక** : పు. ఇది అటుగులుకును, పిల్లవానికిని పేరు.

యమకం యమజె శబ్దా
లంకారె సంయమేఽపి చ।

**యమక** : న. ఇది కవల బిడ్డలకును, యమకాలంకారముకును, తపస్సుకును పేరు.

మశకః కధ్యతె క్షుద్ర
రోగజంతువిశేషయోః॥(39)

**మశక** : పు. ఇది అల్పరోగముకును, దోమకును పేరు.

కులకంతు పటోలెస్యా
చ్ఛ్లోకసంబంధగుచ్ఛకే।
కులకస్యాత్కుల శ్రేష్ఠె
వల్మీకె కాకతిందుకె॥ (40)

**కులక** : న. ఇది పొట్లచెట్టుకును, నాలుగుకంటె నధికమయిన ఏకాన్వయము గల శ్లోకములకును, పు. కులశ్రేష్ఠునకును, పుట్టకును, చిట్టుతుమికి చెట్టుకును పేరు.

తిలకం చిత్రకె ప్రాహు
ర్లలామె తిలకాలకె।
రోగాశ్వ ద్రుమ భేదేషు
క్లోమ్నిసౌవర్చ లేఽపి చ॥ (41)

**తిలక** : న. ఇది బొట్టుకును, ముఖ్యవస్తువుకును, పుట్టుమచ్చకును, రోగవిశేషముకును, గుఱ్ఱముకును, తిలకవృక్షముకును, గర్భమందు కుడిప్రక్కనుండెడి మాంస పిండముకును, సౌవర్చలవణముకును పేరు.

కులికో నాగభేదే స్యా
త్క్షుభేదే కులసత్తమే।
కుశిక స్స్యాన్మునౌ తైల
శేషేసర్జే క్షువృక్షయోః॥ (42)

**కులిక :** పు. ఇది సర్పవిశేషమునకును, వృక్షభేదమునకును, కులశ్రేష్ఠునకును పేరు.

**కుశిక :** పు. ఇది కుశిక మహామునికిని, నూని మడ్డికిని, ఏపిచెట్టుకును, తాడిచెట్టుకును పేరు.

చషకంతు సురాపాత్రె
మేఘమద్య ప్రభేదయోః।
చటకః కలవింకే చ
చటకా స్త్రీ స్త్ర్యపత్యయోః॥ (43)

**చషక:** న. ఇది కల్లుకుండకును, మేఘమునకును, మద్య విశేషమునకును పేరు.

**చటక :** పు. ఇది వూరపిచ్చుగకును, స్త్రీ. ఆడు పిచ్చుగకును, ఆడుపిచ్చుగ పిల్లకును పేరు.

కటకం వలయె సానౌ
రాజధానీ నితంబయోః।
సాముద్రలవణెదంత
మండనె దంతి నామనీ॥ (44)

**కటక:** న. ఇది కంకణమునకును కొండచరియకును, రాజు నివశించు పట్టణమునకును, పిరుదునకును, సముద్రపు వుప్పునకును, ఏనుగ దంతములయొక్క యలంకారమునకును పేరు.

కటుకం కటు రోహిణ్యాం
వ్యోషేపి కటుకం స్మృతం।
చులుకః ప్రసృతౌ భాండ
భేదేచ చులుకం మతం॥ (45)

**కటుక:** న. ఇది కటుక రోహిణికిని, త్రికటుకలకును (అనగా శొంఠి, పిప్పలి, మిరియాలు) పేరు.

**చులుక :** పు. ఇది చారెడునకును, న. చిన్న కుండకును పేరు.

పులకః క్రిమి భేదె స్యా
ద్గంధార్వే మణిదోషయోః।
గజాన పిండె రోమాంచె
హరితాలె శిలాంతరె॥ (46)

**పులక :** పు. ఇది చెట్టువల్లపుట్టెడు ఒక విధమగు పురుగునకును, పూలగుత్తికిని, సూర్యకాంతమణిలోనిదోషమునకును (అనగా పటలము) ఏనుగునకు ఇచ్చెడు అన్నకబళమునకును, గగురుపాటునకును, హరిదళమునకును, వజ్రమునకును పేరు.

రుచకం మంగళద్రవ్యే
గ్రీవాభరణదంతయోః।
పుంస్యే బీజపూరెచ
సౌవర్చలవిడంగయోః॥ (47)
గోరోచనాయాం రుచక
మశ్వాభరణ మాల్యయోః।

**రుచక :** న. ఇది మంగళద్రవ్యమునకును, హార విశేషమునకును, దంతమునకును, వేడుకకును, మాదీఫలపుచెట్టునకును, సౌవర్చలవణమునకును, వాయువిడంగమునకును, గోరోచనమునకును, అశ్వాభరణమునకును, పుష్పమాలకును పేరు.

క్షురకః కోకిలాక్షే స్యా
ద్గోక్షురే తిలకద్రుమే॥ (48)

**క్షురక** : పు. ఇది గొలిమిడి చెట్టుకును, ఏనుగ పల్లేరుకును, తిలక వృక్షముకును పేరు.

కాముకః కమనేఽశోక
పాదపే చాతిముక్తకే।

**కాముక** : పు. ఇది స్త్రీలయందాసక్తిగల వానికిని, అశోకవృక్షమునకును, పూలగురివెందచెట్టుకును పేరు.

పాతుకః పతయాళౌస్యా
త్ప్రపాతజలహస్తినోః॥ (49)

**పాతుక**: పు. ఇది పడునట్టిస్వభావము గల వానికిని, కొండ చరియకును, నీటి యేనుగకును పేరు.

ఆనకః పటహే భేర్యాం
మృదంగే స్వనదంబుదే।

**ఆనక**: పు. ఇది తప్పెటకును, భేరికిని, మద్దెలకును, గర్జించు మేఘమునకును పేరు.

ఆఢకం మానభేదే స్యా
త్తువర్యామాఢకీమతా॥ (50)

**ఆఢక**: న. కొలభేదమునకును, ఈ. స్త్రీ. సురాష్ట్ర దేశమందు పుట్టిన తొవరిమన్నుకును పేరు.

కారకః కర్తరి (నటె) ప్రోక్తః
కర్మాదావపి కారకం।

**కారక**: పు. ఇది పనిచేయువానికిని, న. పనులకును పేరు.

చారకః పాలకేఽశ్వాదే
స్యాత్సంచారకబంధయోః॥

**చారక** : పు. ఇది గజాశ్వాదులను పాలించు వానికిని, సంచరించుటకును, మొండెముకును పేరు.

తారకః కర్ణధారేచ దైత్యేచ
దృశితారకం కనీనికాయాం
నక్షత్రే తారకం తారకేతిచ॥ (52)

**తారక** : పు. ఓడ నడుపువానికిని, తారకాసురునకును, న. నేత్రముకును, కంటి నల్లగ్రుడ్డుకును, నక్షత్రముకును పేరు.

వారకోఽశ్వగతా వశ్వ
విశేషేఽపి నిషేధకే।

**వారక** : పు. ఇది గుర్రపు నడకకును, అశ్వ విశేషమునకును, నివారించు వానికిని పేరు.

పావకోఽగ్నౌ సదాచారే
వహ్నిమంథేచ చిత్రకే॥ (53)
భల్లాతకే విడంగేచ

**పావక** : పు. ఇది అగ్నికిని, ఆచారవంతునకును, నెల్లికూరకును, చిత్రమూలమునకును, జీడిచెట్టుకును, వాయువిడంగమునకును పేరు.

సాయకశ్శరఖడ్గయోః।

**సాయక** : పు. ఇది బాణముకును, కత్తికిని పేరు.

రల్లకః కంబళమృగే
కంబళేచ నిగద్యతే॥ (54)

**రల్లక** : పు. ఇది మృగవిశేషముకును, గొంగళికిని పేరు.

నాయకో నేతరిశ్రేష్ఠే
హారమధ్యమణావపి।

**నాయక** : పు. ఇది రక్షకునకును, శ్రేష్ఠునకును, నాయక మణికిని పేరు.

ప్రాణకస్సత్వజాతియ్యో

**ప్రాణక** : పు. ఇది ప్రాణవాయువుకును, పేగిస

| | |
|---|---|
| జీపకద్రుమబోలయోః॥ (55) | చెట్టుకును, బాలింత బోలుకును పేరు. |
| జాలకం కోరకే ప్రోక్తం<br>కులాయే జాలినీఫలే।<br>ఆనాయేదంభభేదే చ | **జాలక**: న. ఇది లేత మొగ్గకును, పిట్టగూడుకును, పొట్లకాయకును, వలకును, గర్వముకును పేరు. |
| వస్త్ర భేదేచజాలికా॥ (56) | **జాలికా** : స్త్రీ. ఇది వలవలె వెలితిగానేసిన బట్టకు పేరు. |
| బాలకోఽజ్ఞశిశౌ కేశే<br>వాజివారణవాలధౌ।<br>అంగుళీయకహ్రీబెర<br>పారిహార్యేషుబాలకం॥(57) | **బాలక** : పు. ఇది మూఢునకును, పిల్లవానికిని, వెంట్రుకలకును, గుఱ్ఱముయొక్క, యేనుగు యొక్క తోకకుంచెకును, న. ఉంగరమునకును, కురువేరునకును, బంగారుసూడిగాజుకును పేరు. |
| వార్ధకం వృద్ధ సంఘాతే<br>వృద్ధత్వే వృద్ధకర్మణి। | **వార్ధక** : న. ఇది వృద్ధుల సమూహముకును, ముసలితనముకును, వారుచేయు కర్మకును పేరు. |
| మామకం మమతాయుక్తే<br>మాతులే మామకస్మృతః॥ | **మామక** : త్రి. ఇది నాదియనుటకును, పు. మేన మామకును పేరు. |
| యాజకో యాజివిఖ్యాతో<br>యాజకో రాజకుంజరే। | **యాజక** : పు. ఇది యజ్ఞము చేయించువానికిని, రాజెక్కెడి యేనుగకును పేరు. |
| గ్రాహకో ఘాతవిహగే<br>వ్యాళానాంచ గృహీతరి॥ (59) | **గ్రాహక**: పు. ఇది కిరాతునిచేత చంపబడిన పక్షికిని, పాములవానికిని పేరు. |
| దారకోఽ భేదకే పత్యే | **దారక** : పు. ఇది భేదించువానికి, సంతానమునకును పేరు. |
| రాత్రకం పంచరాత్రకే।<br>యోవేశ్యాగృహే స్థితో<br>వత్సరస్సతు రాత్రకః॥(60) | **రాత్రక** : న. ఇది అయిదురాత్రుల సమూహముకును, పు. వేశ్యాగృహమందు సంవత్సరము నివసించినవానికిని పేరు. |
| లాసక్కేలస కేలాస్య<br>కారిణ్యపి మయూరకే। | **లాసక**: పు. ఇది బద్ధకునకును, నృత్యము చేయువానికిని, నెమలికిని పేరు. |
| శార్కకః శర్కరా పిండే<br>దుగ్ధఫేనేఽపిశార్కకః॥(61) | **శార్కక**: పు. ఇది ముద్దచక్కెరకును, పాల నురగకును పేరు. |
| హారక కితవే హారే<br>గద్యవిజ్ఞాన భేదయోః। | **హారక** : పు. ఇది జూదరికిని, దొంగకును, గద్యకును, జ్ఞానవిశేషముకును పేరు. |

| | |
|---|---|
| స్థాసకాఖ్యాతు చార్చి క్యే | **స్థాసక** : పు. ఇది చందనాదుల యొక్క మైపూత |
| జలాదెరపి బుద్బుదె॥ (62) | కును, నీరు మొదలయిన వాట్ల బుడగకును పేరు. |
| ద్రావకస్తు శిలాభెదె | **ద్రావక** : పు. ఇది అయస్కాంతములోని భేదము |
| విద్గ్ధాఘోషకెఽపి చ। | కును, నేర్పరికిని, చేతి బీరచెట్టుకును పేరు. |
| భ్రామకొ జంబుకె ధూర్తె | **భ్రామక**: పు. ఇది నక్కకును, విటునకును, సూర్య |
| సూర్యావర్తాశ్మ భెదయోః। | మండలముకును, సూదిగంటురాతికిని పేరు. |
| పిణ్యాక స్సిక్థకె (స్హ్లకె) హింగౌ | **పిణ్యాక** : పు. ఇది మైనముకును, ఇంగువకును, |
| తిలచూర్ణె (కల్కె) పి కుంకుమె। | తెలక పిండికిని, కుంకుమకును పేరు. |
| పినాకొ హరకొదండె | **పినాక** : పు. ఇది శివధనస్సుకును, పరాగవర్ష |
| పాంసువర్ష త్రిశూలయోః॥ | ముకును, త్రిశూలముకును పేరు. |
| కావ్రుకః కృకవాకౌ స్యా | **కావృక**: పు. ఇది కోడికిని, పచ్చతుంగముస్తకును, |
| త్పీతముస్తకకోకయోః। | చక్రవాక పక్షికిని పేరు. |
| క్షారకః పక్షిమత్స్యాది | **క్షారక** : పు. ఇది పక్షులు, మత్స్యములు చేయు |
| పిటకె జాలకెఽపి చ॥(65) | బుట్టకును, లేత మొగ్గకును పేరు. |
| పాటక స్స్యాన్మహాకిష్కౌ | **పాటక**: పు. ఇది నలుబదిరెండంగుళముల ప్రమాణ |
| కటకాంతర వాద్యయోః। | మునకును, రాజు నివశించు పట్టణ మధ్యమున |
| అక్షాదిడొలనె మూల | కును, వాద్యవిశేషముకును పాచికలు మొదలైన |
| ద్రవ్యపచయ (వెధసోః) రోధసోః॥ | వాటిని దొర్లించుటకును, మూల ద్రవ్యమునకును, |
| | హీనమునకును ఒడ్డుకును పేరు. |
| వరాకస్సంగరె శొచ్యె (ప) | **వరాక**: పు. ఇది యుద్ధమునకును, అనామధేయు |
| వరాకో వ్రతఖడ్గయోః। | నకును, వ్రతమునకును, ఖడ్గముకును పేరు. |
| పులాకస్తుచ్ఛధాన్యె స్యా | **పులాక** : పు. ఇది పొల్లుకును, సంక్షేపముకును, |
| త్సంక్షెపె భక్తసిక్థకె॥ (67) | అన్నపు కణమునకును పేరు. |
| విపాకః కధ్యతె స్వాదౌ | **విపాక**: పు. ఇది రుచికిని, పరిపాకముకును, దుర |
| పరిణామె చ దుర్గతౌ। | వస్థకును, వండుటకును, చెమటకును, దుష్కర్మ |
| విపాకః పచనె స్వెదె | ఫలమునకును పేరు. |
| వ్యసత్కర్మఫలెఽపి చ॥(68) | |
| లంపాకొ లంపటె దెశె | **లంపాక** : పు. ఇది ఆసక్తిగల వానికిని, లంపట |

దేశముకును పేరు.

శింఫాక శ్శఫమూర్ఖయోః।
శం (సం) పాకస్తర్క_కెధృష్టె
(సం) శంపాక శ్శతురంగుళె॥(69)

**శింఫాక:** పు. ఇది అశ్వాదులదెక్క_కును, మూర్ఖున కును పేరు.
**శంపాక** : పు. ఇది ఊహించువానికిని, ధైర్య వంతునకును, రేలచెట్టుకును పేరు.

మోచకః కదళీ శిగ్రు
నిర్మోచక విరాగిషు।

**మోచక:** పు. ఇది అరటి చెట్టుకును, మునుగ చెట్టు కును, మడమలు కప్పియుండు పాదరక్షకును సన్యాసికిని పేరు.

పెచకో గజలాంగూల
మూలపర్యంతఘూకయోః(70)

**పేచక** : పు. ఇది యేనుగతోక మొదటి ప్రదేశము కును, గుడ్లగూబకును పేరు.

మెచకో బర్హిచంద్రె స్యా
న్మెచకః శ్యామలె క పి చ।
తిమిరె కృష్ణవర్ణె తు
మెచకం వాచ్యవద్భవేత్॥(71)

**మెచక:** పు. ఇది నెమలి కన్నుకును, నలుపునకును, న. చీకటికిని, వి. నల్లని వస్తువుకును పేరు.

సూచక స్సీవనద్రవ్యె
బోధకె వృషదంశకె।
పిశునె శుని కాకె చ

**సూచక:** పు. ఇది సూదికిని, బోధించువానికిని, పిల్లికిని, కొండెగానికిని, కుక్క_కును, కాకికిని పేరు.

పెచక ప్పెక్షి మెఘయోః॥

**పేచక:** పు. ఇది తడిపెడువానికిని, మేఘముకును పేరు.

లోచకో మాంసపిండెస్యా
దక్షితారెచ కజ్జలె (కంగులె)।
లలాటాభరణె స్త్రీణాం
కదళీ పింవ్రత్రయోః॥(73)
నిర్భ్రద్దె కర్ణపూరెచ
మౌర్వ్యాం భ్రూన్లధచర్మ(ణి)ణోః॥

**లోచక** : పు. ఇది మాంస పిండముకును, కను గ్రుడ్డుకును, కాటుగకును, పాపట బొట్టుకును, అరటిచెట్టుకును, నల్లగుడ్డకును, బుద్ధిహీనున కును, చెవి కమ్మకును, వింటినారికిని, కనుబొమ్మ కును, ముడతలు పడు చర్మమునకును పేరు.

మోదకో హర్షకె జ్ఞేయః
ఖాద్యభేదేపి మోదకం॥

**మోదక:** పు. ఇది సంతోషము చేయువానికిని, న. ఉండ్రముకును పేరు.

ఖెలకః పాక వల్మీక
వ్యాకాశ శిరస్త్రకె।

**ఖేలక:** పు. ఇది శిశువునకును, పుట్టకును, పోకగెల కును, కుళ్ళాయికిని పేరు.

| | |
|---|---|
| గౌళకో విధవాపుత్రే<br>జారాచ్చ మణికే గుడే॥ (75) | **గోళక** : పు. ఇది మగడు చచ్చిన వెనుక జారత్వము వలన బుట్టినవానికిని, పెద్దబానకును, ఉండకును పేరు. |
| కూపకో గుణవృక్షే స్యా<br>త్తైలపాత్రే కుకుందరే।<br>ఉదపానె (చ్ఛ్య) చితాయాం చ | **కూపక** : పు. ఇది ఓడకొయ్యకును, నూనె పాత్రకును, స్త్రీ పిరుదుల మీదిగుంటులకును, బావికిని, చితికిని పేరు. |
| కూపికాంభోగతో పలె॥ (76) | **కూపికా** : స్త్రీ. ఇది నూతి నీళ్ళయందు మునిగిన రాతికి (అనగా ధర్మరాయి) పేరు. |
| కూలకః కృమిశైలె చ<br>ప్రతీర స్తూపయోరపి। | **కూలక** : పు. ఇది లక్కపుట్టు పర్వతమునకును, ఒడ్డునకును, దిబ్బకును పేరు. |
| రూపకం నాటకె ధూర్తె<br>కావ్యాలంకరణె విదుః॥ (77) | **రూపక**: న. ఇది నాటకమునకును, త్రి. మోసగానికిని, న. రూపకాలంకారముకును పేరు. |
| చూతకః కూపకెప్యామ్రె | **చూతక** : పు. ఇది వాడకొయ్యకును, తియ్యమామిడికిని పేరు. |
| సూతకం రస జన్మనోః। | **సూతక**: న. ఇది పాదరసముకును, పుట్టుగకును పేరు. |
| లూనక స్యాత్పశౌ భిన్నె | **లూనక**: పు. ఇది పశువునకును, త్రి. భేదింపబడిన దానికిని పేరు. |
| శూకకః ప్రావటె రసె॥ (78) | **శూకక** : పు. ఇది పెద్ద గొయ్యికిని, పాదరసముకును పేరు. |
| కీచకో దైత్య భెదె చ<br>శుష్కవంశె ద్రుమాంతరె। | **కీచక**: పు. ఇది కీచకుడను రాక్షసునకును, బొంగు వెదురుకును, వృక్షవిశేషముకును పేరు. |
| కీటకః కృమిభెదె స్యా<br>న్నిష్ఠురె కీటకొన్యవత్॥ (79) | **కీటక** : పు. ఇది పురుగుకును, త్రి. నిష్ఠురమైన దానికిని పేరు. |
| జీవకః పీత (సా.రె) శాలె<br>స్యాత్ క్షపణె వృద్ధిజీవిని।<br>సెవిని ప్రాణకె కస్యాహి<br>తుండికె పాదపాంతరె॥ (80) | **జీవక** : పు. ఇది పేగిమ్రానుకును, క్షపణ మతస్థునకును, వడ్డీచేత జీవించువానికిని, సేవించువానికిని, పాములవానికిని, వృక్షవిశేషమునకును పేరు. |
| ఆజీవె జీవికామాహుర్జీ<br>వంత్యామపి కుత్రచిత్। | **జీవికా** : స్త్రీ. ఇది జీవనోపాయమునకును పాలకూరకును పేరు. |

| | |
|---|---|
| దీపకం వాగలంకారె | **దీపక**: న. ఇది అలంకార భేదముకును, పు. |
| దీపకొ దీప్తికారకెు (81) | శమును చేయువానికిని పేరు. |
| చీరకొౖధిక్రియా లెఖె | **చీరక** : పు. ఇది అధికార పత్రముకును, మి |
| పతంగ్యాం చీరకా మతా | కును పేరు. |
| సెవకస్తు ప్రసెవె స్యా | **సేవక** : పు. ఇది వీణయొక్క కరిదెకును, వి. |
| దనుజీవిని వాచ్యవత్॥ (82) | వలన జీవించు వానికిని పేరు. |
| అశోకొ వంజుళె మానె | **అశోక**: పు. ఇది అశోక వృక్షముకును, గర్వవి |
| ద్రుమని శోకయోర్మతః। | ముకును, కంకేళి వృక్షముకును, దుఃఖము లేకుం |
| అశోకా కటురోహిణ్యా | టకును, స్త్రీ. కటుక రోహిణికిని, న. పాదరసః |
| మశోకం పారదె స్మృతం॥ (83) | కును పేరు. |
| ఆలోకొ దర్శనె ద్యోతె | **ఆలోక** : పు. ఇది చూచుటకును, ప్రకాశకున |
| చాలోకొ వందిభాషణె। | చిత్తగింపులకును పేరు. |
| పెటకం పుస్తకాదీనాం | **పెటక** : న. ఇది పుస్తకములు మొదలయిన వా |
| మంజూషాయాం కదంబకె॥ | పెట్టెకును, సమూహమునకును పేరు. |
| హెరుకొ బుద్ధభెదె స్యా | **హేరుక** : పు. ఇది బుద్ధ విశేషునకును, ఈశ్వరుని |
| న్మహాకాలగణైపిచ। | ప్రమథ గణమునకును పేరు. |
| ధెనుకం కరణె స్త్రీణాం | **ధేనుక** : న. ఇది స్త్రీల రతిబంధ విశేషమునకును, |
| ధెనూనామపి సంహతౌ॥ (85) | గోవుల సమూహమునకునుపేరు. |
| వివెకః స్యాజ్జల ద్రోణ్యాం | **వివేక** : పు. ఇది నీళ్ళు తోడెదు చాద మొదలైన వాటికిని, |
| విచారైపి రహస్యపి। | బ్రహ్మవిచారణకును, రహస్యమునకును పేరు. |
| గైరికం కనకె ధాతౌ | **గైరిక** : న. ఇది బంగారునకును, ధాతువిశేష |
| | ముకును పేరు. |
| ప్రసెక స్స్రవనె చ్యుతౌ॥ | **ప్రసేక** : పు. ఇది తడుపుటకును, జారుటకును పేరు. |
| బైజికం శిగ్రుతైలె చ | **బైజిక** : న. ఇది మునుగ నూనెకును, హేతువున |
| హెతౌ సద్యోౖంకు రైపిచ। | కును, పు. అప్పుడుపుట్టిన మొలకకును పేరు. |
| కొరకం కుట్మలె విద్యాత్త | **కోరక** : న. ఇది మొగ్గకును, తక్కోల ఫలమున |
| క్కోలక మృణాళయోః॥ | కును, తామరతూడుకును పేరు. |
| కౌతుకం చాభిలాషె స్యా | **కౌతుక**: న. ఇది అపూర్వ వస్తువును కోరుటకును, |

| | |
|---|---|
| దుత్సవె నర్మహర్షయోః। | ఉత్సవమునకును, ప్రేమకును సంతోషమున |
| పరంపరా సమాయాతం | కును, పారంపర్యముగా వచ్చెడు మంగళ |
| మంగళెచ కుహూహలె॥ (88) | ములకును, వేడుకకును, వివాహాదు లయందు |
| వివాహ సూత్రగీతాది | హస్తమున ధరించు సూత్రముకును, గానాదుల |
| భోగకాలెషు చ స్మృతం। | కును, భోగ సమయమునకును పేరు. |
| కౌశికొ నకులె వ్యాళ | **కౌశిక:** పు. ఇది ముంగిసకును, పాముల వానికిని, |
| గ్రాహె గుగ్గులు శక్రయోః॥ | గుగ్గులు వృక్షముకును, దేవేంద్రునకును, విశ్వా |
| విశ్వామిత్రె చ కౌశజ్ఞో | మిత్ర మహామునికిని, శబ్ద శాస్త్రము తెలిసిన వాని |
| లూకయోరపి కౌశికః। | కిని, గుడ్లగూబకును, ఈ. స్త్రీ. పార్వతికిని, కౌశిక |
| కౌశికీచండికాయాం చ | యను నదికిని పేరు. |
| నదీభెదెచ కౌశికీ॥ (90) | |
| ప్రతీకొఽవ యవె ఖ్యాతః | **ప్రతీక:** పు. ఇది అవయవమునకును, విరోధము |
| ప్రతికూల విలోమయోః। | కును, తలక్రిందగుటకును పేరు . |
| భూ(తి)తీక మపి భూవింబె | **భూతీక :** న. ఇది నేలవేముకును, ఓమముకును, |
| దీవ్య కర్పూర కత్తృణె॥ (91) | కర్పూరముకును, కామంచి గడ్డికిని పేరు. |
| అభీకః కాముకెక్రూరె | **అభీక :** పు. ఇది విటునకును, దుష్టునకును, కవి |
| (శంభౌ)కవౌ చ భయవర్జితె | కిని, భయములేనివానికిని పేరు. |
| వల్మీకొ వామలూరౌ స్యా | **వల్మీక:** పు. ఇది పుట్టకును, వాల్మీక మహామునికిని, |
| న్మని రోగ విశేషయోః॥ | రోగ విశేషమునకును పేరు. |
| అనీకం తు రణె సైన్యె | **అనీక :** న. ఇది యుద్ధమునకును, సైన్య విశేషము |
| వ్యళీకొ నాగరె స్మృతః। | కును పేరు. |
| వ్యళీక మప్రియాకార్య | **వ్యళీక:** పు. ఇది శొంఠికిని, న. ఇష్టములేనిపనికిని, |
| వైల క్ష్యేష్వపి పీడనె॥ (93) | దుష్కార్యముకును, సిగ్గుకును, పీడకును పేరు. |
| నాళీకం (శరఖండె) పద్మ | **నాళీక :** న. ఇది పద్మముల సమూహముకును, |
| షండెఽబ్జె నాళీక శ్శరశల్యయోః। | పద్మముకును, పు. బాణముకును, బాణపు అలుగు కును పేరు. |
| అళీకమప్రియె(ప్రోక్తమ)ఫాలె | **అళీక :** న. ఇది అయిష్టముకును, నుదుటికిని, |
| వ్యళీక మన్పృతె (దివి)ఽపిచ॥(94) | అబద్ధముకును, ఆకాశముకును పేరు. |

| | |
|---|---|
| అనూకం తు కులె శీలే | **అనూక** : న. ఇది కులమునకును, సత్స్వభావము |
| వ్యనూకొ గతజన్మని। | నకును, పు. పూర్వజన్మకును పేరు. |
| ఉలూకః (కురవిందె) కురుయోధె | **ఉలూక**: పు. ఇది భారతయోధునకును, గుడ్లగూబ |
| స్యాత్పెచకె జంభ భేదిని (95) | కును, దేవేంద్రునకును పేరు. |
| శంబూకొ గజకుంభాంతె | **శంబూక** : పు. ఇది యేనుగకుంభస్థలాగ్రమున |
| దైత్యభెదెచ ఘోంగకె। | కును, శంబూకుడను రాక్షసునకును, జలజంతువి |
| జలశుక్తౌ తు శంబోక | శేషమునకును, కప్పచిప్పకును పేరు. |
| శ్శంబూకాపి నిగద్యతె॥ (96) | |
| బంధూకొ బంధుజీవె స్యా | **బంధూక**: పు. ఇది మంకెనచెట్టుకును, వేగిగ్రమాను |
| ద్బుందూకః పీతసా (ర) లకె। | కును పేరు. |
| మండూకొ బంధభెదెऽపి | **మండూక** : పు. ఇది బంధవిశేషమునకును, కప్ప |
| దర్దురె శౌణకె విదుః॥ (97) | కును, దుండిగపు చెట్టుకును, ఈ.స్త్రీ. మంజిష్ఠ |
| మండూక పర్ణ్యాం మండూకీ, | యనెడి గ్రంధ్యద్రవ్యమునకును పేరు. |
| వర్ణ కశ్చారణె స్మృతః। | **వర్ణక**: పు. ఇది నాట్యగానికిని, న. మైపూతకును, |
| విలెపనె చందనేచ | మంచిగంధమునకును పేరు. |
| వర్ణకంస్యాధార్భకః॥ (98) | **అర్భక** : పు. ఇది పిల్లవానికిని, మూర్ఖునకును, |
| డింభెమూర్ఖెకృశె భ్రూణె | కృశించిన వానికిని, గర్భమునకును పేరు. |
| వర్తకొऽశ్వఖురె ఖగె। | **వర్తక** : పు. ఇది గుఱ్ఱపు డెక్కకును, మీనవల్లంకి |
| | పక్షికిని పేరు. |
| పుష్పకం రీతికా నేత్ర | **పుష్పక** : న.ఇది కుసుమాంజనము, నేత్రరోగ |
| రోగయో రత్నకంకణె॥ (99) | విశేషమునకును, రత్నకంకణమునకును, కుబేరపుష్పక |
| కుబెరస్య విమానె చ | మునకును, అన్నభేదికిని, రసాంజనమునకును, |
| కాశీశె చ రసాంజనె లో (హె) | లోహముతో గూడిన కంచుకును, మట్టికుంపటి |
| హకాంస్యే మృదంగారశక | కిని పేరు. |
| ట్యామపి పుష్పకం॥ (100) | |
| ఫూర్ణకః స్వర్ణచూడె స్యాన్నాసా | **పూర్ణక**: పు. ఇది పాలపిట్టకును, స్త్రీ. ముక్కువద్ద |
| (ఘోణ్యాం) ఛిన్నాంతు పూర్ణికా। | నరుకువలెనుండు పక్షి విశేషమునకును పేరు. |
| దర్శక స్స్యాత్ప్రతీహారె | **దర్శక**: పు. ఇది ద్వారపాలకునకును, చూపించు |

దర్శయితృ ప్రవీణయోః ॥(101) — వానికిని, నేర్పరికిని పేరు.

పద్మకం పద్మకాష్ఠే (ఽబ్జ) భ
బిందుజాలక యోరపి।

**పద్మక**: న. ఇది తామరకాడకును, యేనుగయొడలి యందలి తెల్లపొడమచ్చలకును పేరు.

దీప్యకంచాజమోదాయాం
యవానీ బర్హి చూడయోః॥

**దీప్యక** : న. ఇది ఓమముకును, ఓమములోని భేదముకును, మయూరశిఖియను గ్రంధ్యముకును పేరు.

సస్యకస్స్యాన్మణౌ ఖడ్గే
నారికెళస్య చాంతరే।

**సస్యక**: పు. ఇది మాణిక్య విశేషముకును, కత్తికిని, టెంకాయలోని భాగముకును పేరు.

రక్తకోఽ మ్లా (త) నబంధూక
రక్తవస్త్రాను రాగిషు ॥ (103)

**రక్తక** : పు. ఇది తెల్ల పెద్ద గోరింటకును, మంకెన చెట్టుకును, యెర్రబట్టుకును, అనురాగము గలవానికిని పేరు.

చిత్రకస్స్యాత్తరువ్యాఘ్ర
భెదయోర్భేషజాంతరే।

**చిత్రక** : పు. ఇది ఆముదపు చెట్టుకును, చిరుత పులికిని, చిత్రమూలముకును పేరు.

వృశ్చికస్తు ద్రుణౌ రాశౌ
శూకకీటే తథౌషధే ॥ (104)

**వృశ్చిక** : పు. ఇది తేలుకును, వృశ్చిక రాశికిని, కందిరీగకును, తెల్లగలిజేరుకును పేరు.

ఆంశుకం వస్త్రమాత్రేస్యా
త్సూక్ష్మ వస్త్రోత్తరీ యయోః।

**అంశుక** : న. ఇది వస్త్ర సామాన్యమునకును, సన్నబట్టకును, పైట చెంగుకును పేరు.

అంతికం నికటె చుల్ల్యా
మంతికా శీతలౌషధె ॥ (105)
తథాజ్యేష్ఠ భగిన్యాంచ
నాట్యోక్తౌ కీర్త్యతెఽంతికా

**అంతిక**: న. ఇది సమీపమునకును, స్త్రీ. పొయికిని, చలవచేయు ఔషధమునకును, నాట్య పరిభాష యందు జ్యేష్ఠభగినికిని పేరు.

స్వస్తికో మంగళద్రవ్యే
చతుష్క గృహభెదయోః॥ (106)
పిష్టకస్య వికారె చ
స్వస్తికో రతతాళికె।

**స్వస్తిక**: పు. ఇది మంగళద్రవ్యముకును, నలువైపుల చావడులు గల యింటికిని, ద్వార భేదముచేత కట్టబడిన రాజగృహ విశేషముకును, పిండివంటలోని భేదముకును, విటునకును పేరు.

కంచుకో వారవాణౌ స్యా
న్నిర్మోకెకవచే ఽపిచ ॥ (107)
వర్ధాపక గృహీతాంగ
స్థితవస్త్రేచ చోలకె।

**కంచుక**: పు. ఇది యుద్ధభటులు తొడుగు చొక్కాకును, కుబుసముకును, కవచమునకును, చొక్కాలోని భేదము (దూది బొంత చొక్కా అని కొందరు) చొక్కాకును (లేక రవికెకును.) ఈ. స్త్రీ. ఓషధి

| | |
|---|---|
| ఔషధౌ కంచుకీ చాథ | విశేషముకును పేరు. |
| వంచకః ఖలధూర్తయోః॥ | **వంచక**: పు. దుర్జనునకును, ధూర్తునకును, నక్క |
| జంబుకె గృహబభ్రౌచ | కును, ఊరముంగిసకును పేరు. |
| గృహ్యకశ్ఛేకనిఘ్నయోః। | **గృహ్యక**: పు. ఇది పెంపుడు మృగపక్ష్యాదులకును, |
| | పరాధీనునకును పేరు. |
| బంధకస్యాద్వినిమయె | **బంధక** : పు. ఇది ఒక దానినిచ్చి ఇంకొక దానిని |
| పుంశ్చల్యామపిబంధకీ॥ (109) | పుచ్చుకొనుటకును (అనగా తాకట్టు మొదలగునవి) |
| | ఈ. స్త్రీ. లంజకును పేరు. |
| గాంధికో లేఖకె ప్రాహుః | **గాంధిక** : పు. ఇది వ్రాయువానికిని, పరిమళ |
| స్సుగంధివ్యవహారిణి। | వస్తువుల నమ్మువానికిని పేరు. |
| గ్రంధికం పిప్పలీమూలె | **గ్రంథిక**: న. ఇది పిప్పలి దుంపకును, పు. గుగ్గులు |
| గ్రంధికో గుగ్గులుద్రుమె॥ (110) | వృక్షముకును, సహదేవునకును; వెదురు గుంపున |
| మాద్రేయేచ కరీరెచ | కును, జ్యోతిష్కునకును పేరు. |
| దైవజ్ఞేచ ప్రకీర్తితః। | |
| బాహ్లీకో దేశభేదెऽశ్వె | **బాహ్లీక** : పు. ఇది దేశ విశేషముకును, **బాహ్లీక** : |
| బాహ్లీకం ధీరహింగునోః॥ | బాహ్లీకదేశమునపుట్టినగుర్రముకును, న. కుంకు |
| అనయోరపి బాహ్లీకో | మకును, ఇంగువకును పేరు. |
| యాజ్ఞికౌ యాజకె శుకె। | **యాజ్ఞిక**: పు. ఇది ఋత్విజునకును, చిలుకకును పేరు. |
| వార్షికంత్రాయమాణాస్యా | **వార్షిక** : న. ఇది కలుత్రానుగు చెట్టుకును, వి. |
| ద్వర్షాకాలభవె ऽన్యవత్॥ | వర్షాకాలమందైన దానికిని పేరు. |
| ఖడ్గికో మహిషీ క్షీర | **ఖడ్గిక** : పు. ఇది గేదెపాలమీది నురగకును, |
| ఫేనాసైనికయోరపి। | దండుకొలిచే వానికిని పేరు. |
| ఆహ్నికం దినసిర్వర్త్యె | **ఆహ్నిక**: న. ఇది ప్రతిదినమున్నూ చేయ తగ్గపను |
| భోజనె నిత్య(దిన)కర్మణి॥(113) | లకున్ను, భోజనముకును, నిత్యకర్మలకును పేరు. |
| గుండకో మలినె ధూళౌ | **గుండక**: పు. ఇది మలినముకును, పరాగము కును, |
| కలోక్తి స్నేహపాత్రయోః। | మధురభాషణముకును, నూనె పాత్రకును పేరు. |
| గండకః ఖడ్గిని ఖ్యాత | **గండక** : పు. ఇది ఖడ్గమృగమునకును, సంఖ్యా |
| స్సంఖ్యావిద్యాప్రభేదయోః॥(114) | విశేషమునకును, విద్యావిశేషమునకును, విచ్ఛేద |

| | |
|---|---|
| అవచ్ఛేదేऽంత రాయే చ<br>గండకీ సరిదంతరే। | మునకును, విఘ్నమునకును, ఈ.స్త్రీ. గండకీ నదికిని పేరు. |
| తండకః ఖంజనే ఫేనే<br>సమాసప్రాయవాచిని॥ (115)<br>గృహదారౌ తరుస్కంధ<br>మాయాబహుళయోరపి। | **తండక:** పు. ఇది కాటుక పిట్టకును, నురుగకును, సమాసముతో గూడిన వాక్యముకును, యింటి దూలముకును, చెట్టు మొదలుకును, మాయల మారి వానికిని పేరు. |
| కంటకః క్షుద్రశత్రౌ చ<br>కర్మస్థానక దోషయోః। (116)<br>(రోమాంచె చద్రుమాంగెచ)<br>వేణౌ ద్రుమాంగెరోమాంచె<br>కంటకోమక రే ऽ పి చ। | **కంటక:** పు. ఇది అల్పశత్రువుకును, కార్యస్థానము నకును, దోషవిశేషముకును, పెదురుకును, తుమ్మ మొదలైన వాటి ముల్లుకును, గగుర్పాటుకును, మొసలికిని పేరు. |
| తక్షకః ఫణభేదే స్యా<br>ద్వర్ధకిద్రుమభేదయోః॥ (117) | **తక్షక** : పు. ఇది తక్షకుడను సర్పరాజుకును, వడ్లవానికిని, వృక్షవిశేషముకును పేరు. |
| పక్షకః పార్శ్వ మా త్రెచ<br>(పార్శ్వద్వారసహాయయోః)<br>పక్షద్వారె చ పక్షకః। | **పక్షక** : పు. ఇది పార్శ్వసామాన్యమునకును, దిడ్డివాకిలికిని పేరు. |
| శంఖకం వలయె కంబౌ<br>శిరోరోగె చ శంఖకః॥ (118) | **శంఖక** : న. ఇది కడియమునకును, శంఖమున కును, శిరమునపుట్టిన రోగవిశేషమునకును పేరు. |
| నందకో హరిఖడ్గె చ<br>హర్షకె కులపాలకె। | **నందక:** పు. విష్ణుని ఖడ్గమునకును, సంతోషమును చేయువానికిని, కులమును రక్షించువానికిని పేరు. |
| శీతక శ్శీతకాలే చ<br>సుస్థితె ద్రీర్ఘ సూత్రిణి॥ (119) | **శీతక** : పు. ఇది శీతకాలముకును, సుఖవంతున కును, మందునకును పేరు. |
| ఉష్ణకస్తు నిదాఘె స్యా<br>దాతురె క్షిప్రకారిణి। | **ఉష్ణక** : పు. ఇది గ్రీష్మకాలముకును, రోగపీడితు నకును, శీఘ్రముగా పనిచేయువానికిని పేరు. |
| దు(ఃకు)చ్ఛకో గంధకుట్యాంస్యా<br>ద్విహారాభ్యవకాశయోః॥ (120) | **దుచ్ఛక:** పు. ఇది మురయను ఓషధికిని, విహరించు టకును, వ్యవధానమునకును పేరు. |
| డుండు (దుండు) కః<br>శోణకె క్రూరె | **డుండుక:** పు. ఇది దుండిగపు చెట్టుకును, కుటిల హృదయమునకును పేరు. |

| | |
|---|---|
| క్షుల్లకః స్వల్పనీచయోః। | **క్షుల్లక**: పు. ఇది స్వల్పముకును, నీచునకును పేరు. |
| పిష్టకో నేత్రరోగే చ | **పిష్టక** : పు. ఇది నేత్రరోగ విశేషముకును, ధాన్య |
| ధాన్యాదిచమ సేఽపి చ॥ (121) | ముల పిండితో చేసిన వాటికిని పేరు. |
| భస్మకం రోగభేదే స్యా | **భస్మక** : న. ఇది రోగ విశేషముకును, వాయు |
| ద్విడంగకలధౌతయోః। | విడంగముకును, వెండికిని పేరు. |
| చుంబక స్స్వాద్బహుగురు | **చుంబక**: పు. ఇది అనేకమంది గురువులు గలవాని |
| ధూర్తాయస్కాంతకాముకే॥ | కిని, వంచకునకును, అయస్కాంత రాతికిని, విటునకును పేరు. |
| జంబుకః (శ్వాపదే) ఫేరవేనీచే | **జంబుక** : పు. ఇది నక్కకును, నీచునకును, |
| ప్రతీచీదిక్పతా వపి। | వరుణ దేవునికిని పేరు. |
| కార్ముకం వంశధనుషోః | **కార్ముక**: న. ఇదివెదురునకును, ధనుస్సునకును, |
| కర్మశక్తేతు వాచ్యవత్॥ (123) | వి. కర్మయందు సమర్థునకును పేరు. |
| నిర్మోకో మోక్షకే వ్యోమ్ని | **నిర్మోక** : పు. ఇది మోక్షమునకును, ఆకాశము |
| సన్నాహే సర్పకంచుకే। | నకును, కవచమునకును, పాము కుబుసమునకును పేరు. |
| హుడుక్కో వాద్యభేదే చ | **హుడుక్క** : పు. ఇది డక్కికిని, కూకురు గద్దంగి |
| దాత్యూహే మదమత్తకే॥ | పిట్టకును, గంజాయి చెట్టుకును పేరు. |
| తురుష్కః సిల్హకే మ్లేచ్ఛ | **తురుష్క** : పు. ఇది అందుగ బంకతో చేసిన ధూప |
| జాతౌ శ్రీవాసకే క్వచిత్। | ద్రవ్యముకును, తురకవానికిని, దేవదారు బంకతో చేసిన ధూపద్రవ్యముకును పేరు. |
| ఇక్ష్వాకుః కటుతుంబ్యాంచ | **ఇక్ష్వాకు** : పు. ఇది చేతి ఆనపకాయకును ఇక్ష్వాకు |
| సూర్యవంశన్నృపే ఽపి చ॥ | మహారాజుకును పేరు. |
| కుతాకు (కుంతాకు) శ్చదు | **కుతాకు** : పు. ఇది పొందశక్యము కాని వానికిని, |
| రాధర్షేదుశ్శీలే చ బిలేశయే। | దురాచారునకును, సర్పముకును పేరు. |
| కు(ధా)షాకుర్మర్కటేభానౌ | **కుషాకు** : పు. ఇది కోతికిని, సూర్యునకును, |
| పరోత్తాపిని పావకే॥ (126) | పరులను బాధించువానికిని, అగ్నికిని పేరు. |
| పృదాకు ర్వృశ్చికే వ్యాఘ్రే | **పృదాకు** : పు. ఇది తేలుకును, పెద్ద పులికిని, |
| చిత్రకే చ సరీసృపే। | చిరుతపులికిని, సర్పమునకును పేరు. |

| | |
|---|---|
| సృదాకురనిలె వజ్రె | **సృదాకు :** పు. ఇది వాయువునకును, వజ్రాయుధ ముకును, |
| దావాగ్నౌ ప్రతిసూర్యకె ॥ (127) | దావానలమునకును, సూర్యపరివేషమునకును పేరు. |
| గోరంకుః పక్షిజాతౌ స్యా | **గోరంకు :** పు. ఇది పక్షి విశేషమునకును, నగ్నక |
| ద్భవే న్నగ్నక వందినోః। | పక్షికిని, స్తుతిపాఠకునకును పేరు. |
| త్రిశంకుః శలభె రాజ | **త్రిశంకు :** పు. ఇది మిడతకును, త్రిశంకు మహా |
| విశేషె పృషదంశకె ॥ (128) | రాజునకును, పిల్లికిని పేరు. |
| పల్యంకో మంచ పర్యంక | **పల్యంక :** పు. ఇది మంచముకును, పరుపుకును, |
| బృషీ పర్యస్తికాసు చ। | తివాసీకిని, యోగపట్టకును పేరు. |
| కరంకో మస్త (కెశస్య) కాష్ఠె స్యా | **కరంక:** పు. ఇది తలపుర్రెకును, టెంకాయ బోరియ |
| న్నా రికెళఫలా స్థిని ॥ (129) | కును పేరు. |
| కలంకోఙ్కేఙపవాదెచ | **కలంక:** ఇది గురుతుకును, అపవాదుకును, ఇనుప |
| కాలాయసమలెఙ పిచ। | చిట్టముకును పేరు. |
| భాలాం ( జ్వాలా) కః కరపత్రె | **భాలాంక:** పు. ఇది రంపమునకును, శాక విశేషము |
| స్యాచ్ఛాకభెదె చరోహితె ॥ (130) | కును, (తోటకూరని కొందరు) యెరుపు వర్ణము |
| మహాలక్షణ సంపన్న | నకును, గొప్ప సాముద్రిక లక్షణములు గలవాని |
| పురుషెకచ్ఛపెహరౌ। | కిని, తాబేటికిని, విష్ణువునకును పేరు. |
| వృషాంక శ్శంకరె సాధౌ | **వృషాంక :** పు. ఇది శివునకును, సజ్జనునకును, |
| భల్లాతక మ(హోక్ష)హల్లయోః॥ (131) | జీడిచెట్టుకును, అంతఃపురము కావలి వానికిని పేరు. |
| మృగాంకోమారు తె చంద్రె | **మృగాంక:** పు. ఇది వాయువుకును, చంద్రునికిని పేరు. |
| స్తబకః శుభ్రగుచ్ఛయోః। | **స్తబక :** పు. ఇది నిర్మలమైన దానికిని, గుత్తికిని పేరు. |
| ఆతంకో రోగ సంతాప | **ఆతంక:** పు. ఇది రోగ విశేషముకును, పరితాపము |
| శంకాసు మురజధ్వనౌ॥ (132) | కును, శంకకును, మద్దెలవాద్యముకును పేరు. |
| పాలంకః శల్లకీ శాకభెద | **పాలంక :** పు. ఇది అందుగు చెట్టుకును, శాక |
| యోఃప్రాజి ( వాజి) పక్షిణి। | విశేషముకును, పాలంకి పిట్టకును పేరు. |
| అలర్కో ధవళార్కె స్యా | **అలర్క :** పు. ఇది తెల్లజిల్లేడుకును, రోగముచేత |
| ద్రోగోన్మాదిత(ని)కుర్కు(క్కు)రె (133) | వెర్రిపట్టిన కుక్కకును పేరు. |

| | |
|---|---|
| ఉదర్కః ఎష్యత్కాలీయ | **ఉదర్క** : పు. ఇది ఉత్తరకాల ఫలమునకును, వృక్ష |
| ఫలే మదనకంటకే। | విశేషముకును పేరు. |
| సంపర్కః స్సురతెప్పృక్తౌ | **సంపర్క** : పు. ఇది రతికిని, తాకుటకును పేరు. |
| వితర్కః స్సంశయోహయోః॥(134) | **వితర్క** : పు. ఇదిసందేహముకును, ఊహకును పేరు. |
| అంబికా పార్వతీ పాండు | **అంబికా** : స్త్రీ. ఇది పార్వతికిని, పాండురాజు |
| జనన్యోరపి మాతరి। | తల్లికిని, తల్లికిని పేరు. |
| అంధికా కైతవే మిశ్రే (శర్వర్యా) | **అంధికా** : స్త్రీ. ఇది జూదముకును, కూడిన |
| సర్షప్యామపి కీర్త్యతె ॥ (135) | దానికిని, కాటుగ పిట్టకును పేరు. |
| అంబకో జనకె బాణనేత్ర | **అంబక** : పు. ఇది తండ్రికిని, న. బాణముకును, |
| మండేషు ఛాంబకం। | నేత్రముకును, మీగడకును పేరు. |
| పిండె రత్నె మహారత్నె | |
| ఘుటికా బద్ధపారదె॥ (136) | **ఘుటికా** : స్త్రీ. ఇది ఉండకును, రత్నమునకు, నాయకమణికిని, రసగుళికకును పేరు. |
| అమ్లికా తింత్రిణీ (తిడీ) కా | **అమ్లికా** : స్త్రీ. ఇది చింతచెట్టుకును, పులుసుకును, |
| మ్లోద్గారచ్ఛాంగేరికాసు చ। | పులిచింతయను వృక్షవిశేషముకును పేరు. |
| యూధికా మ్లానకె పుష్ప | **యూధికా** : స్త్రీ. ఇది తెల్ల పెద్ద గోరింటుకును, |
| విశె (ష్యేపిచ యూధికా) | పుష్ప విశేషముకును, అడవిమొల్లచెట్టుకును పేరు. |
| షాంబష్ఠయోరపి ॥ (137) | |
| రాజికాపి చ కెదారె | **రాజికా** : స్త్రీ. ఇది వరిమడికిని, నల్లావాలకును, |
| రాజసర్షప రేఖయోః। | రేఖకును పేరు. |
| రసికాపిర సాలాయాం | **రసికా** : స్త్రీ. ఇది తియ్యమామిడి చెట్టుకును, |
| కాంచీరసనయోరపి॥ (138) | మొలనూలుకును, నాలుకకును పేరు. |
| రుండికా ద్వార వీధ్యాం చ | **రుండికా** : స్త్రీ. ఇది ద్వారపంక్తికిని, దూతికకును, |
| దూతికియాం రణక్షితౌ। | యుద్ధభూమికిని పేరు. |
| భూమికా రచనాయాంస్యా | **భూమికా** : స్త్రీ. ఇదిచేయుటకును, వేషమునకును |
| న్మూర్త్యంతరపరిగ్రహె॥ | పేరు. |
| కర్ణికా కరిహస్తాగ్రె | **కర్ణికా** : స్త్రీ. ఇది యేనుగుతుండముకొనకును, |
| కరమధ్యాంగుళావపి। | చేతినడిమి వ్రేలికిని, పోకగెల మొదలయిన వాటి |

| | |
|---|---|
| క్రముకాదిఫలాంశే చ | |
| కర్ణికా కర్ణ భూషణే ॥ (140) | గోలకకును, చెవి యాభరణమునకును, తామర దుద్దుకును, కుంటెనకత్తెకును పేరు. |
| బీజకోశే సరోజస్య | |
| కుట్టన్యామపి కుత్రచిత్। | |
| కణికా కథ్యతే ऽ త్యంత | **కణికా** : స్త్రీ. ఇది మిక్కిలి సన్నని బట్టకును, |
| సూక్ష్మవస్త్రాగ్ని మంథయోః॥ | నెల్లికూరకును, గోధుమరవ్వకును, సూదికిని, |
| గోధూమచూర్ణె సూచ్యాం చ | చిత్తరువులు మొదలగునవి వ్రాయుకుంచెకును |
| తూలికాయాం చ కీర్తితా। | పేరు. |
| గణికా యూథికా వేశ్యా | **గణికా** : స్త్రీ. ఇది అడవిమొల్లచెట్టుకును, బోగము |
| తర్కారీ కరిణీషు చ॥ (142) | దానికిని, తక్కెడు చెట్టుకును ఆడయేనుగకును |
| గణికో ऽ పి చ దైవజ్ఞే | పేరు. **గణక** : పు. ఇది జ్యోతిష్కునకు పేరు. |
| కారికా నటయోషితి। | **కారికా** : స్త్రీ. ఇది నాట్యస్త్రీకిని, వాగ్రూపకార్యము |
| కృతౌ వివరణశ్లోకె | నకును, సూత్రార్థమును తెలుపు శ్లోకముకును, |
| యాతనాయాంచకారికా॥(143) | తీవ్రవేదనకును, మంగలి మొదలయిన వాళ్ళ పని |
| నాపితాదికశిల్పే ऽ పి | తనమునకును పేరు. |
| జాలికా జాలినీఫలే। | **జాలికా** : స్త్రీ. ఇది పొట్లకాయకును, శిలా విశేషము |
| భటానామశ్మరచితాం | చేరచియించిన యుద్ధభటుల డాలు మొదలైన |
| గరక్షిణ్యాం చ జాలికా॥(144) | వాటికిని, ఇనుమునకును, జలగకును, నేలనేరేడు |
| గిరిసారె జలూ కాయాం | చెట్టుకును, మగడు చచ్చిన దానికిని పు. గ్రామ |
| నాదేయ్యాం విధవ స్త్రీయాం | సమూహముకును, పల్లెవానికిని పేరు. |
| జాలికః పునరుద్దిష్టో | |
| గ్రామకూటే చ ధీవరె॥ (145) | |
| నీలికానీలినీ క్షుద్ర | **నీలికా** : స్త్రీ. ఇది నీలిచెట్టుకును, క్షుద్రరోగవిశేషము |
| రోగ శేఫాలికాసు చ॥ (146) | కును, నల్లపువ్వుల వావిలి చెట్టుకును, ఈగకును |
| మక్షికాయాం | పేరు. |
| కాళికా తు స్వర్ణదోష పరస్పతోః। | **కాళికా** : స్త్రీ. ఇది బంగారములోని దోషముకును, |
| కాళికా యోగినీభేదే | కల్లుకును, యోగినీ విశేషముకును, నలుపుకును, |
| కార్ష్ణ్యేగౌర్యాం ఘనావళౌ॥ | పార్వతికిని, మేఘపంక్తికిని, ప్రతినెలకూ నిచ్చువడ్డీ |

| | |
|---|---|
| క్రమదేయవస్తుమూల్యే | మొదలగు వానికిని, కిన్నర స్త్రీకిని, కరిమబ్బుకును, |
| ధూసరీ నవమేఘయోః। | పొట్లతీగకును, రోమరాజికిని, జటామాంసికిని |
| పటోల శాఖారోమాళీ | కాకికిని, నాగదంతి చెట్టుకును పేరు. |
| మాంసీ కాకీషు కథ్యతే॥ (148) | |
| తథావృశ్చిక పత్రేऽపి | |
| మాలికా సరిదంతరే గ్రైవె | **మాలికా** : స్త్రీ. ఇది నదీ విశేషముకును, కంఠహార |
| యే పుష్పమాలాయాం | విశేషముకును, పూదండకును, పక్షివిశేషముకును |
| పక్షిమల్లేऽపి మాలికా॥ (149) | పేరు. |
| బా(వా)లికా వాలుకాబాలా | **బాలికా : వాలికా** : స్త్రీ. ఇది యిసుకకును, కన్య కును, |
| (పిచ్ఛో)పింజోలా కర్ణభూషణే। | మీనవల్లంకి పిట్టకును, చెవి యాభరణ విశేష ముకును పేరు. |
| తూలికా కథితా లేఖ్యే | **తూలికా**: స్త్రీ. ఇది కలముకును, చిత్రవులు వ్రాయు |
| కూర్చి కాతూలశయ్యయోః | కుంచకును, దూదిపురుపుకును పేరు. |
| చూళికా నాటకస్యాంగే | **చూళికా**: స్త్రీ. ఇది నాటకమందలి యొక భాగవిశేషముకును, |
| కర్ణమూలే చ దంతినాం। | ఏనుగ చెవియొక్క మొదటి భాగము కును పేరు. |
| మల్లికా తృణశూల్యేऽపి | **మల్లికా**: స్త్రీ. ఇది మల్లిచెట్టుకును, మత్స్య విశేషము |
| మీనమృత్పాత్రభేదయోః॥ | కును, మండిగ(లేక మూకుడు) కును, పు. హంస |
| మల్లికో హంసభేదేऽథ | విశేషముకును పేరు. |
| ఝల్లికా ఝిల్లికేత్యుభే। | **ఝల్లికా : ఝిల్లికా** : స్త్రీ. ఇది నలుగు పెట్టిన |
| విలేపనమలే ఝిల్యా | పిండికిని చిమ్మెటకును, యెండయొక్క కాంతికిని |
| మాతపస్య రుచిస్మృతా॥ (152) | పేరు. |
| వాలుకా సికతాసు స్యా | **వాలుకా** : స్త్రీ. ఇది యిసుకకును, న. కూతురు |
| ద్వాలుకం త్వేలవాలుకే। | బుడమ చెట్టుకును పేరు. |
| నగ్నికా తు కుమార్యాంస్యా | **నగ్నికా** : స్త్రీ. ఇది పెండ్లికాని పది సంవత్సరముల |
| దథ క్షపణ వందినోః॥ | లోపు వయసు కల పడుచుకును పేరు. |
| నగ్నికో ధేనుకా ధేనౌ | **నగ్నక** : పు. ఇది క్షపణ మతస్థునకును, స్తుతిపాఠ |
| స్త్రీకరే(ణు)ణ్వోః ప్రసూతయోః | కునకును పేరు. **ధేనుకా** : స్త్రీ. ఇది గోవుకును, ప్రసవించిన స్త్రీకిని, ఆడ యేనుగకును పేరు. |
| రేణుకా పి హరేణౌ స్యా | **రేణుకా** : స్త్రీ. ఇది రేణుకమను గంధద్రవ్యము |

జ్జమదగ్ని స్త్రియ్యామపి॥ (154) కును, పరశురాముని తల్లికిని పేరు.

జతుకా జినపత్రాయాం జతుకంహింగులాక్షయోః — **జతుకా**: స్త్రీ. ఇది చీకురు వాయిపురుగుకును, న. ఇంగువకును, లక్కకును పేరు.

కూర్చికా సూచికాయాం చ తూలికాయాం చ కుట్మలే కవాటకీలకే క్షీరవికృతావపికూర్చికా — **కూర్చికా**: స్త్రీ. ఇది సూదికిని, చిత్తరువులు వ్రాయు కుంచెకును, మొగ్గకును, కుంచెకోలమొదలయిన వాటికిని, జున్నుకును పేరు.

మాతృకాధా (తృ) త్రికామాత్రో ర్మాతృకం కరణే స్వరే॥ (156) — **మాతృకా**: స్త్రీ. ఇది పెంపుడు తల్లికిని, న. నాట్య విశేషముకును, స్వరముకును పేరు.

పతాకా వైజయంత్యాంచ సౌభాగ్యేఽంక ధ్వజేఽపిచ — **పతాకా**: స్త్రీ. ఇది టెక్కెము (లేక జండా) కును సింధూరముకును, గురుతు జండాకును పేరు.

స్యాత్పుత్రికా పుత్తళికా దుహిత్రో ర్యావతూలకే॥ (157) — **పుత్రికా**: స్త్రీ. ఇది వస్త్రదంతాదులచేత చేయబడిన బొమ్మకును, కుమార్తెకును, లత్తుక దూదికిని పేరు.

పుత్రక శ్శలభే ధూర్తే శైలవృక్షప్రభేదయోః। — **పుత్రక**: పు. ఇది మిడతకును, మోసకానికిని, పర్వత విశేషముకును, వృక్షవిశేషముకును పేరు.

ఉష్ట్రికా మృత్తికాభాండ భేదేఽపి కరభస్త్రియాం॥ — **ఉష్ట్రికా**: స్త్రీ. ఇది మట్టికుండలోని భేదముకును, ఆడ ఒంటెకును పేరు.

డింబికా జలబింబే స్యా త్స్యోనాకే కాముక స్త్రియాం — **డింబికా**: స్త్రీ. ఇది నీటి దొండ చెట్టుకును, దుండి గపు చెట్టుకును, కులటకును పేరు.

స్యమీకా నీలికాయాం చ స్యమీకో నాకు వృక్షయోః॥ — **స్యమీకా**: స్త్రీ. ఇది నీలిచెట్టుకును, పుట్టకును, వృక్షవిశేషముకును పేరు.

దూషికా తూలికాయాంచ దూషికా నేత్రయోర్మలే। — **దూషికా**: స్త్రీ. ఇది రంగులు వేయుకుంచకును, కండ్లపుసికిని పేరు.

ఊర్మికా త్వంగుళీయే స్యా ద్వస్త్రభంగ తరంగయోః॥ తథోత్కంఠో ద్భాహుంలక భృంగస్యానేషు చోర్మికా।సూచ్యాం — **ఊర్మికా**: స్త్రీ. ఇది వ్రేలియుంగరమునకును, బట్టకుచ్చెళ్ళకును, అలకును, వేడుకకును, సంగీత ధ్వని విశేషముకును, తుమ్మెద ఝుంకారముకును పేరు.

శలాకా మదనశాలికా శల్యయోశ్శలే॥ (161) — **శలాకా**: స్త్రీ. ఇది సూదికిని, మ్రంగ చెట్టుకును, గసిగకును, ఎదు పందిముల్లుకును, గొడుగు

ఛత్రపంజర కాష్ఠ్యాం చ
శ(స) ల్లకీ పశు వృక్షయోః।

మొదలయిన వాటి కామకును పేరు.
**శల్లకీ :** స్త్రీ. ఇది ఏదుపందికిని, **సల్లకీ :** అందుగు చెట్టుకును పేరు.

నర్తకీ లాసికాయాంచ
కరిణ్యామపి నర్తకీ ॥ (162)
నర్తకః కేలకె పోటగళ
చారణయో ర్నటే।

**నర్తకీ :** స్త్రీ. ఇది నాట్య స్త్రీకిని, ఆడ యేనుగకును, పు. కత్తివాయి మొదలయిన వాటిపైన నృత్యము చేయువానికిని, కిక్కిస గడ్డికిని, నాట్యగానికిని (అనగా కుశీలవుడు) దుండిగపు చెట్టుకును పేరు.

చుల్లకీ శింశుమారే చ
కుండీ భేదే కులాంతరే॥ (163)

**చుల్లకీ :** స్త్రీ. ఇది పిడకమొసలికిని, పాత్ర విశేషముకును, కులవిశేషముకును పేరు.

చతుష్కీ మశక హర్యాం
చ తుష్కీ యష్టికాంతరే।

**చతుష్కీ :** స్త్రీ. ఇది కప్పుకొను వస్త్ర విశేషముకును, నాలుగు పేటల ముక్తాహారముకును పేరు.

జాహకో ఘోంఘు మార్జాల
ఖట్వా కారుండి కాసు చ॥

**జాహక :** పు. ఇది జంతువిశేషముకును, పిల్లికిని, మంచముకును, నీటి కోడికిని పేరు.

★ అథ కాంతశ్చతుర్వర్ణః ★

అళిమకః పికే భేకే
మధూకే పద్మకేసరే।

**అళిమక :** పు. కోకిలకును, కప్పకును, ఇప్ప చెట్టుకును, పద్మకింజల్కముకును పేరు.

భవేదళిపకో భృంగే
కోకిలే రతహిండకే॥ (165)

**అళిపక :** పు. ఇది తుమ్మెదకును, కోకిలకును, విటునకును పేరు.

స్మృతః కురవక శ్శోణా
మ్లాన ఝింటీ ప్రభెదయోః।

**కురవక :** పు. ఇది యెర్ర పెద్ద గోరింటకును, ములుగోరింటకును పేరు.

భవేన్మరువకః పుష్ప
విశేషేమదనద్రుమే॥ (166)

**మరువక :** పు. ఇది పుష్ప విశేషముకును, (అనగా మరువక పుష్పము) మ్రంగచెట్టుకును పేరు.

బలాహకో గిరౌమేఘే
దైత్యనాగవిశేషయోః।

**బలాహక :** పు. ఇది బలాహకపర్వతముకును, బలాహక మను మేఘముకును, బలాహకుడను రక్కసునకును, దేవయోని సర్పవిశేషముకును పేరు.

భ్రమరకో జలే భృంగే
గిరకే చూర్ణకుంతలే॥ (167)

**భ్రమరక :** పు. ఇది జలమునకును, తుమ్మెదకును, చిట్టెలుకకును, ముంగురులకును పేరు.

వరాటకః స్థూలరజ్జౌ

**వరాటక :** పు. ఇది మోకు త్రాటికిని, తామరపూస

కడారః పింగళే దాసే
సంభార స్సంభృతౌ గణే॥

**కడార**:పు. ఇది పింగళవర్ణముకును, దాసునకును పేరు.
**సంభార**: పు. ఇది పరికరముకును, సమూహము కును పేరు.

కేదారః కుంభినరకే
శిరఃక(పో) పాల సంధిషు।
సంకారో౽గ్నిచటాత్కారే
సమ్మార్జ న్యవమార్జితే॥ (183)
నవదూషితకన్యాయాం
సంకారీ క్వాపి దృశ్యతే।

**కేదార**: పు. కుంభీపాకమను నరకముకును, శిరస్సు కును, పుఱ్ఱెకును, సంబంధ ప్రదేశముకును పేరు.
**సంకార**: పు. ఇది అగ్నియొక్క చటచట ధ్వనికిని, చీపురుచేత నూడవబడిన పెంటకును, ఈ. స్త్రీ. క్రొత్తగా దూషితురాలగు కన్యకును పేరు.

పంకార శ్శైవలే సేతౌ
సోపానే జలకుబ్జకే॥ (184)
సంస్కారః ప్రతి యత్నేస్యా
త్సంకల్పేకమభవేౌ పి చ।

**పంకార**: పు. ఇది నాచుకును, కట్టకును, మెట్టు కును, నీటి నెమ్మిచెట్టుకును పేరు.
**సంస్కార**: పు. ఇది ఒక వస్తువుకు గుణాతిశయము గలిగించుటకును, మనో వ్యాపారముకును, ఎఱుక కును పేరు.

ప్రాకారం స్యాద్ద్వ్యాస్తి నఖే
సోపానే పక్షిపంజరే॥ (185)

**పాలార**: న. ఇది పురద్వార సమీపమందు శత్రువు లు లోన చొరకుండుటకై వేసిన మంటితిన్నెకును, మెట్టుకును, పిట్టల పంజరముకును పేరు.

కంజారో జఠరే సూర్యే
విరించౌ వారణే మునౌ।
మార్జార ఓతౌ ఖట్వాసే
భృంగారః కనకాలుకే॥ (186)
భృంగారీ ఝిల్లికాయాంస్యా
దంగారో౽లాత భౌమయోః।

**కంజార**: పు. ఇది జఠరాగ్నికిని, సూర్యునకును, బ్రహ్మకును, ఏనుగుకును, మునికిని పేరు.
**మార్జార**: పు. పిల్లికిని, జవ్వాదిపిల్లికిని పేరు.
**భృంగార**: పు. ఇది బంగారు జలపాత్రముకును, ఈ. స్త్రీ. చిమ్మెటకును పేరు.
**అంగార** : పు. కొరవి నిప్పునకును, అంగారక గ్రహముకును పేరు.

శృంగార స్సురతే నా(ట్యేరసే) ట్య
రసేఽపి గజమండనే॥ (187)
శృంగారం చూర్ణ సిందూర
లవంగకును మేషు చ।

**శృంగార**: పు. ఇది సురతముకును, శృంగార రస ముకును, గజాలంకారముకును, న. బుక్కామొదలగు పరిమళ చూర్ణముకును, సింధూరముకును లవంగముకును పేరు.

విస్తారో విస్తృతౌస్తంబ
ఉద్ధార శ్చోద్ధృతావృణే॥
మాఠరో ద్విజ భేదే స్యా
ద్వ్యాసేऽర్క_పరిపార్శ్వకే।

**విస్తార**: పు. ఇది విస్తరించుటకును, దుబ్బునకును పేరు.
**ఉద్ధార** : పు. ఎత్తుటకును, అప్పునకును పేరు.
**మాఠర** : పు. ఇది ఒక బ్రాహ్మణునకును, వేద వ్యాసునకును, సూర్యునిపార్శ్వమందుండెడు ఒక దేవునకును పేరు.

శాబరః కథ్యతే లోధ్రే
తథాపాపాపరాధయోః॥
శాబరీ శూకశింబ్యాం చ
శారీరం దేహజే వృషే।

**శాబర** : పు. ఇది లొద్దుగ చెట్టుకును, పాపము కును, నేరముకును, ఈ. స్త్రీ. దూలగొండి చెట్టు కును పేరు.
**శారీర** : త్రి. ఇది శరీర సంబంధమైన దానికిని, వృషభముకును పేరు.

కరీరః కలశే వృక్ష
భేదే వంశాంకురేऽపి చ॥ (190)
కరీరీ చీరికాయాం చ
దంతమూలే చ దంతినాం।

**కరీర**: పు. ఇది కుండకును, వెణుతురుచెట్టుకును, వెదురు బోదుకును, ఈ. స్త్రీ. చిమ్మెటకును, ఏనుగు దంతముయొక్క మొదటి భాగముకును పేరు.

శణీరం శోణమధ్యస్థ
పులినేదర్దురీతటే ॥ (191)
జంబీరః ప్రస్థపుష్పాఖ్య
శాకేదంతశఠేऽపి చ।
ఔశీరమాహు శ్చమరే
దండే చ శయనాసనే॥
సౌవీరం బదరే స్రోతే
ऽంజనే దేశే చ కాంజికే।
కి(మ్మీ) ర్మీరః కర్బురేదైత్య
రాక్షసాంతరయోరపి॥ (193)
కాశ్మీరం కుంకుమే ప్రోక్తం
టంక పుష్కరమూలయోః।
పాటీరో వాతికేరంగే
మూలకేతితఉన్యపి॥ (194)

**శణీర** : న. శోణనదమధ్యమందలి యిసుము తిన్నెకును, దర్దురీనదియొడ్డుకును పేరు.
**జంబీర**: పు. ఇది మరువముకును, నిమ్మచెట్టుకును పేరు.
**ఔశీర**: న. ఇది సురటీకిని, దుడ్డుకును, పానుపున కును, పీఠముకును పేరు.
**సౌవీర** : న. ఇది రేగుపండుకును, సౌవీరాంజనము కును, పు. సౌవీరదేశముకును, పులికడుగునకును పేరు.
**కిర్మీర**: పు. ఇది కర్బురవర్ణముకును, రాక్షససామాన్య ముకును, బకాసురుని తమ్మునకును పేరు.
**కాశ్మీర** : న. ఇది కుంకుమముకును, పులికిని, పుష్కరమూలమనెడు గంధ ద్రవ్యముకును పేరు.
**పాటీర** : పు. ఇది సోమింత చెట్టుకును, సీసము కును, మొల్లంగిదుంపకును, జల్లెడకును, మేఘము

ధారాధరేఽపి కేదారే
వేణుసారేఽపి చేష్యతే।

కును, వరిపంట భూమికిని, వెదురుగంధముకును పేరు.

అండీరః పురుషే శక్తే
హిండీరః పురుషే స్మృతః॥
ఫేనే వాతింగణే చాథ

**అండీర**: పు. ఇది పురుషునకును, సమర్థునకును పేరు.

**హిండీర**: పు. ఇది పురుషునకును, నురుగుకును, వంగచెట్టుకును పేరు.

ధూసరః పాండురే ఖరే।
కూబరః కుబ్జకే చారౌ
కూబరశ్చ యుగంధరే॥

**ధూసర**: పు. ధూసరవర్ణముకును, గాడిదకును పేరు.

**కూబర**: పు. ఇది నెమ్మిచెట్టుకును, త్రి. సుందరమైన దానికిని, పు. రథమునకును కాడికిని మధ్యనుండెడి నొగలుకును పేరు.

తూబరోఽశ్మశ్రుపురుషే
ప్రౌఢాశృంగవృషేఽపి చ।
స్యాన్నీవరో వణిజకే
వాస్తవ్యేఽపి చ నీవరః॥ (197)

**తూబర**: పు. పేడిమూతి వానికిని, వయసుగలిగిన్ని కొమ్ములులేని యెద్దుకును పేరు.

**నీవర**: పు. ఇది వర్తకునకును, నివసించువానికిని పేరు.

పీవరః కచ్ఛపే స్థూలే
ధీవరో లుబ్ధకే బుధే।
కేసరం హింగుని ప్రోక్తం
కేసరో నాగకేసరే॥ (198)
సింహచ్ఛటయాం పున్నాగ
కింజల్కే వకుళేష్వపి।

**పీవర**: పు. ఇది తాబేటికిని, త్రి. బలిసిన దానికిని పేరు.

**ధీవర**: పు. జాలరివానికిని, విద్వాంసునకును పేరు.

**కేసర**: న. ఇది ఇంగువకును, పు. నాగకేసరపు చెట్టుకును, సింహముమెడమీదనుండు జటకును, పొన్నచెట్టుకును, పుష్పకింజల్కముకును, పొగడ చెట్టుకును పేరు.

కిశోరస్తు రుణావస్థే
హయశాబకసూర్యయోః॥ (199)

**కిశోర**: పు. ఇది బాలునకును, గుఱ్ఱపుపిల్లకును, సూర్యునకును, చందన వృక్షముకును పేరు.

తైలపర్ణ్యాం కుబేరస్తు
నందివృక్షే ధనాధిపే।

**కుబేర**: పు. నందిచెట్టుకును, కుబేరునకును పేరు.

కణేరు స్స్యాద్వశావేశ్యా
కర్ణికారే గణేరువత్॥

**కణేరు** : **గణేరు** : స్త్రీ. ఈ రెండును, ఆడు ఏనుగుకును, వెలయాలికిని, పు. కొండగోగుచెట్టుకును పేరు.

కోటీరశ్శక్రగోపేస్యా
చ్చక్రేపి నకులేపిచ।

**కోటీర**: పు. ఇది ఆర్ద్ర పురుగునకును, ఇంద్రునకును, ముంగిసకును పేరు.

అగురు స్స్యాచ్ఛింశుపాయాం

**అగురు** : పు. ఇది ఇరుగుడు చెట్టుకును, అగరు

| | |
|---|---|
| జోంగకే పి లఘున్యపి॥ | గంధముకును, లఘ్వక్షరముకును పేరు. |
| కింశారు స్సస్యశూకేऽపి | **కింశారు** : పు. వరిముల్లుకును, బాణముకును, |
| సాయకే కంకపక్షిణి। | రాఖులుగుకును పేరు. |
| భార్యారు శ్శైలభేదే స్యా | **భార్యారు** : పు. ఇది పర్వత విశేషముకును, మృగ |
| న్మృగభేదే చ తత్ర చ॥(202) | విశేషముకును, ఎవ్వడు పరస్త్రీయందు పుత్రుని |
| క్రీడయా పరభార్యాయాం | గనెనో వానికిని పేరు. |
| పుత్రో యేనోపపాదితః। | |
| కుతారుః పాదపే కీశే | **కుతారు** : పు. ఇది వృక్షముకును, కోతికిని పేరు. |
| కటప్రూ స్యాన్మహానటే॥(203) | **కటప్రూః** : పు. ఇది శివునకును, విద్యాధరునకును, |
| విధ్యాధరే రక్షసి చ | రాక్షసునకును, పాచికలాటకును పేరు. |
| కటప్రూరక్షదేవనే। | |
| దాసేరో దాసికా పుత్రే | **దాసేర** : పు. ఇది దాసీపుత్రునకును, ఒంటెకును |
| దాసేర స్స్యాత్క్రమేళకే॥ | పేరు. |
| మయూరో బర్హిచూడాయా | **మయూర** : పు. స్థాణేయమను గంధ ద్రవ్యము |
| మపామార్గే శిఖండిని। | కును, ఉత్తరేణి చెట్టుకును, నెమలికిని పేరు. |
| ఖర్జూరం రజతే విద్యా | **ఖర్జూర**: న. ఇది వెండికిని, పు. తేలుకును, ఖర్జూర |
| ద్వృశ్చిక ద్రుమభేదయోః॥(205) | వృక్షముకును పేరు. |
| ఖర్జూరశ్చాథ | |
| కర్బూరం శటీ | **కర్బూర** : న. ఇది గంట్లకచోరముకును, బంగారు |
| కాంచన యోరపి। | కును పేరు. |
| సిందూర స్తరుభేదే స్యా | **సిందూర** : పు. ఇది సిందూరపు చెట్టుకును, న. |
| త్సిందూరం రక్తచూర్ణకే॥(206) | సిందూరముకును, ఈ. స్త్రీ. కంపిల్లమనెడు గంధ |
| సిందూరీ రోచనీర క్త | ద్రవ్యముకును, ఎఱ్ఱని బట్టకును, ధాతకీపుష్ప |
| చేలికా ధాతకీషు చ। | మనెడి గంధద్రవ్యముకును పేరు. |
| వల్లూరం స్యా ద్వనక్షేత్రే | **వల్లూర** : త్రి. ఇది అడవి భూమికిని, వాహనము |
| వాహనోషరయోరపి॥ (207) | నకును, చవిటి పఱ్ఱభూమికిని, ఎండిన మాంసము |
| వల్లూరమాహు స్సంశుష్క | కును, పందిమాంసముకును పేరు. |
| మాంస సూకరమాంసయోః। | |

ఏకాగ్రమేకతానే స్యా
దేకాగ్రం త్రిష్వనాకులే॥(208)

**ఏకాగ్ర**: త్రి. ఇది నిశ్చలచిత్తునకును, ధైర్యశాలికిని పేరు.

నరేంద్రో వార్తికే రాజ్ఞి
విషవైద్యేఽపి కథ్యతే।

**నరేంద్ర** : పు. ఇది జాబులుమోయు వానికిని, రాజునకును, విషచికిత్సచేయు వానికిని పేరు.

మహేంద్రః పర్వతే శక్రే

**మహేంద్ర** : పు. మహేంద్ర పర్వతముకును, ఇంద్రునకును పేరు.

జలేంద్రో వరుణేఽంబుధౌ॥(209)
జంభలేఽపి జలేంద్రస్స్యా

**జలేంద్ర**: పు. ఇది వరుణదేవునకును, సముద్రముకును, నిమ్మచెట్టుకును పేరు.

త్సాముద్రం దేహలక్షణే
సాముద్రం చ సముద్రీయ
లవణాదిషు భేద్యవత్॥(210)

**సాముద్ర**: న. ఇది సముద్రునిచే జెప్పబడిన దేహలక్షణ శాస్త్రముకును, త్రి. సముద్రమందుబుట్టిన లవణాదులకును పేరు.

ఖండాభ్రమభ్రలేశే స్యా
త్స్త్రీణాం దంతక్షతాంతరే।

**ఖండాభ్ర**: న. ఇది మేఘశకలముకును, స్త్రీలదంతక్షత విశేషముకును పేరు.

కటిత్రం రశనాయాం స్యా
చ్చ(ద్వ)ర్మాంగే కటివాససి॥(211)

**కటిత్ర** : న. ఇది మొలనూలుకును, కటిప్రదేశమందుండెడు పటకా మొదలగువాటికిని, కటిప్రదేశమందలి వస్త్రముకును పేరు.

శిలీంధ్రం కదలీపుష్పే
కవకత్రిపుటాఖ్యయోః।
శిలీంధ్రఃకథితో ధీరై-
స్తరు మీన ప్రభేదయోః॥(212)
గండూపద్యాం మృది ప్రోక్తా
శిలీంధ్రీ విహగేభిదిః।

**శిలీంధ్ర**: న. ఇది అరటిపువ్వుకును, కుక్కగొడుగునకును, తెల్లతెగడకును, పు. నేలతాడిచెట్టుకును, మత్స్య విశేషముకును, ఈ. స్త్రీ. అడుకప్పకును, మంటికిని, పక్షివిశేషముకును పేరు.

తమిస్రం తిమిరే కోపే
తమిస్రా చ తమస్తతౌ॥ (213)
కృష్ణపక్ష నిశాయాం చ

**తమిస్ర** : న. ఇది చీకటికిని, కోపముకును, స్త్రీ. చీకట్లసమూహముకును కృష్ణపక్షరాత్రికిని పేరు.

త్వక్పత్రం తు వరాంగకే।
త్వక్పత్రీచైవ కారవ్యాం

**త్వక్పత్ర** : న. ఇది లవంగపు చెక్కకును, ఈ. స్త్రీ. ఇంగువచెట్టుకును పేరు.

కలత్రం శ్రోణి భార్యయోః॥(214)

**కలత్ర** : న. ఇది కటిప్రదేశముకును, భార్యకును,

దుర్గస్థానేన్నృపాదీనాం

రాజునివసించెడు కోటకును పేరు.

పవిత్రం వర్షణే కుశే।
పవిత్రం తామ్ర పయసో
ర్మేధ్యే చాపి తదన్యవత్॥

**పవిత్ర**: న. ఇది వర్షముకును, దర్భకును, రాగికిని, జలముకును, త్రి. పవిత్రమైన దానికిని పేరు.

సావిత్ర శ్శంకరే ప్రోక్త
స్సావిత్రీ దేవతాంతరే।

**సావిత్ర** : పు. ఇది శివునకును, ఈ. స్త్రీ. దేవతా విశేషముకును పేరు.

దైత్యారి స్త్రిదశే విష్ణౌ

**దైత్యారి**: పు. ఇది దేవునకును, విష్ణువుకును పేరు.

తిత్తిరి ర్విహగే మునౌ॥

**తిత్తిరి**: పు. ఇది పక్షివిశేషముకును, తిత్తిరిమునికిని పేరు.

శాంకరి ర్విఘ్నపే స్కందే

**శాంకరి**:పు. ఇది పిళ్ళారికిని, కుమారస్వామికిని పేరు.

జసురిః పావకే పవౌ।

**జసురి**: పు. ఇది అగ్నికిని, వజ్రాయుధముకును పేరు.

మందురా వాజిశాలాయాం
సమీపార్థే చ వస్తుని॥ (217)

**మందురా** : స్త్రీ. ఇది గుఱ్ఱపుసాలకును, సమీపమందైన వస్తువుకును పేరు.

ఉర్వరా సర్వసస్యాఢ్య
భూమౌస్యాద్భూమిమాత్రకే।

**ఉర్వరా**: స్త్రీ. ఇది సస్యముతోగూడియున్నభూమికిని, సామాన్యభూమికిని పేరు.

అసురా రజనీ రాస్యా
రసురో దానవే రవౌ॥ (218)

**అసుర** : స్త్రీ. ఇది రాత్రికిని, ఆడుయొంటెకును, పు. రాక్షసునకును, సూర్యునకును పేరు.

వాసురా వాసి తాయాం స్యా
ద్వాసరేయ్యాం మతాభువి।

**వాసురా** : స్త్రీ. ఇది స్త్రీ సామాన్యముకును, రాత్రికిని, భూమికిని పేరు.

మసూరా మసురా వ్రీహి
ప్రభేదే పణ్యయోషితి॥(219)
మసూర మసురౌ చద్వా
వేతావ ప్యేతయోర్మతౌ।

**మసూరా, మసురా**: పు. ఈరెండును, చిఱుసెనగలకును, వేశ్యకును పేరు.

శర్కరా ఖండవికృతా
వుపలా కర్ప రాంశయోః॥(220)
శర్కరాన్వితదేశేఽపి
రుగ్భేదే శకలేఽపి చ।

**శర్కరా**: స్త్రీ. ఇది పంచదారకును, మొరపరాతికిని, పుఱ్ఱెయొక్క భాగముకును, మొరపనేలకును, రోగవిశేషముకును, తునకకును పేరు.

కచ్చురా శూకశింబ్యాంచ
శటీ దుష్పర్శ యోరపి॥ (221)

**కచ్చురా** : స్త్రీ. ఇది దూలగొండి చెట్టుకును, నల్లయతివసకును, పిన్నరేగటి దూలగొండి చెట్టు

కచ్ఛురం వాచ్యవత్త్రాహుః
పామనే పుంశ్చలేऽపి చ।

కును, త్రి. గజ్జిపట్టినవానికిని, జారునకును పేరు.

గాయత్రీ కథితా ఛందః
ప్రభేదే ఖదిరేऽపి చ॥(222)

**గాయత్రీ** : స్త్రీ. ఇది గాయత్రీ ఛందముకును, చంద్ర చెట్టుకును పేరు.

సైరంధ్రీ పరవేశ్మస్థ
శిల్పకృత్స్వ వశస్త్రియాం।
వర్ణ సంకర సంభూత
స్త్రీ మహల్లకయోరపి॥(223)

**సైరంధ్రీ**: స్త్రీ. పరులగృహమందు పనులజేయుచూ స్వతంత్రముగా జీవించెడు స్త్రీకిని, సంకరవర్ణమందు బుట్టినదానికిని, పు. అంతఃపురపరిచారకునకును పేరు.

ఖదిరీ శాకభేదేऽపి
ఖదిరో దంతధావనే।
(వాచ్యవత్సుందరం రమ్యే
ప్రియే పత్న్యా తు సుందరః)
సుందరీ స్త్రీ తరుభిదో

**ఖదిరీ** : స్త్రీ. ఇది శాక విశేషముకును, పు. పెనిమిటికిని ఈ.స్త్రీ. స్త్రీకిని, వృక్షవిశేషము కును పేరు.

శ్శర్వరీ రాత్రి యోషితోః॥(224)
హరిద్రాయాం చ

**శర్వరీ**: స్త్రీ. ఇది రాత్రికిని, స్త్రీసామాన్యముకును, పసపునకును పేరు.

కబరీ కేశశాకవిశేషయోః।
కబరం లవణేऽమ్లేచ
తుంబురీశరమర్దయోః॥

**కబరీ**: స్త్రీ. ఇది కొప్పునకును, శాకభేదముకును, న. ఉప్పునకును, పులుసునకును, పు. కొత్తిమిరికిని, ఓషధి విశేషముకును పేరు.

మంజరీ వల్లరీ స్థూల
ముక్తా తిలక శాఖిషు।

**మంజరీ** : స్త్రీ. ఇది పూలగుత్తికిని, పెద్ద ముత్యముకును, తిలక వృక్షముకును పేరు.

మర్మరీ పీతదారౌ స్యా
ద్వస్త్ర భేదేऽపి మర్మరః॥

**మర్మరీ** : స్త్రీ. ఇది మానిపసపునకును, పు. వస్త్ర విశేషముకును పేరు.

టట్టరీ స్యాన్మృషావాదే
లంపా పటహయోరపి।

**టట్టరీ**: స్త్రీ. ఇది అబద్ధపుమాటకును, లంపావాద్యముకును, ఢక్కావాద్యముకును పేరు.

శక్వరీ మేఖలా నద్యో
శ్ఛందో భేదేऽపి శక్వరీ॥

**శక్వరీ**: స్త్రీ. ఇది మొలనూలుకును, నదీ విశేషముకును, **14**వ ఛందముకును పేరు.

ఝుల్లరీ ఝులరీ చద్వే
హుడుక్కే (బాలచక్రకే) కేశ వక్రకే।

**ఝుల్లరీ, ఝులరీ**: స్త్రీ. ఇది జేగంటకును, చక్రాకారమైన వెంట్రుకలకును పేరు.

| | |
|---|---|
| కావేరీ స్యాత్సరిద్భేదే | **కావేరీ:** స్త్రీ. కావేరీ నదికిని, వెలయాలికిని, పసపున |
| పణ్యనారీ హరిద్రయోః॥ | కును పేరు. |

★ అథరాంతశ్చతుర్వర్ణః ★

| | |
|---|---|
| భవేత్పరికరో వ్రాతే | **పరికర:** పు. ఇది సమూహముకును, శయ్యకును, |
| పర్యంక పరివారయోః। | పరిజనముకును, గాఢాలింగన విశేషముకును, |
| ప్రగాఢ గాత్రికాబంధే | జ్ఞానముకును, ప్రారంభముకును పేరు. |
| వివేకా రంభయోరపి॥ (229) | |
| వ్యతికర స్సమాఖ్యాతో | **వ్యతికర:** పు. ఇది దుఃఖముకును, పరస్పరసంమేళ |
| వ్యసన వ్యతిషంగయోః। | నముకును పేరు. |
| విభాకరోఽగ్నౌ తపనే | **విభాకర :** పు. ఇది అగ్నికిని, సూర్యునకును పేరు. |
| వస్కారో గుహ్యగూఢయోః॥(230) | **అవస్కర :** పు. మర్మాంగముకును, రహస్యము |
| | కును పేరు. |
| కర్మకరస్తు కీనాశే | **కర్మకర :** పు. ఇది యమునకును, సేవకునకును, |
| భృత్యే వేతన జీవిని। | జీతగానికిని, ఈ. స్త్రీ. చాగ చెట్టుకును, పు. దొండ |
| కర్మకరీతు మూర్వాయాం | చెట్టుకును పేరు. |
| బింబికా యామపిక్వచిత్॥(231) | |
| అరుష్కరో వ్రణకరే | **అరుష్కర:** త్రి. పుండుచేయుదానికిని, న. జీడిగింజ |
| భల్లాతే చాప్యరుష్కరం। | కును పేరు. |
| భవేత్సహచరో ఝింట్యాం | **సహచర :** పు. ఇది నల్ల పెద్ద గోరింటు చెట్టుకును, |
| వయస్యే ప్రతిబింబకే॥ (232) | చెలికానికిని నీడకును పేరు. |
| నిశాచరః పేచకా హి | **నిశాచర :** పు. ఇది గుడ్లగూబకును, పామున |
| యాతుధానేషు ఫేరవే। | కును, రాక్షసునకును, నక్కకును, ఈ. స్త్రీ. రంకు |
| నిశాచరీ పాంసు (శు) లాయాం | లాడికిని పేరు. |
| భవేత్ప క్షచరో విధౌ॥ (233) | **పక్షచర :** పు. చంద్రునకును, కదుపునుంచి విడి |
| యూథభ్రష్ట పృథక్చారి | యొంటరిగా సంచరించు యేనుగుకును పేరు. |
| వార ణేపి ప్రకీర్తితః। | |
| చరాచరం స్యాజ్జగతి | **చరాచర:** న. ఇది ప్రపంచముకును, త్రి. మనుష్య |
| వాచ్యవజ్జంగ మేంగయోః॥ | పశుపక్ష్యాదులకును, భావసూచకములగు భ్రూభం |

గ్రాదులకును పేరు.

విదు ర్దశపురం దేశే
ముస్తాయాం పట్టణేఽపి చ

**దశపుర** : న. ఇది మాళవ దేశమందలి యొక భాగముకును, తుంగముస్తకును, పట్టణవిశేషముకును పేరు.

అభిమరో వధే యుద్ధే
తథాస్వబలసాధ్వసే॥ (235)

**అభిమర** : పు. ఇది చంపుటకును, యుద్ధముకును, స్వపక్ష సైన్యమువలని భయమునకును పేరు.

ఆహుఃప్రతిసరం హస్త
సూత్రే మాల్యే చ మండనే।
వ్రణశుద్ధౌ చమూపృష్ఠే
నియోజ్యారక్షకంకణే॥ (236)
మంత్రభేదే

**ప్రతిసర** : న. ఇది దీక్షాదులయందు కట్టిన హస్త సూత్రముకును, పూలదండకును, అలంకారముకును, వ్రణములను శుద్ధిచేయుటకును, సేన యొక్క వెనుక భాగముకును, పు. భృత్యునకును, ఏనుగు కుంభస్థలముయొక్క క్రింది భాగముకును, కడియముకును, మంత్ర విశేషముకును పేరు.

ఽప్యవసరో వర్ష
ప్రస్తావయోరపి।

**అవసర** : పు. ఇది వానకును, కార్యోచిత సమయముకును పేరు.

స్మృతఃపరిసరో మృత్యౌ
దైవోఽంత ప్రదేశయోః॥

**పరిసర** : పు. ఇది మృత్యువుకును, దైవముకును, గ్రామాదుల సమీప ప్రదేశముకును పేరు.

దిగంబర స్స్యాత్క్షపణే
నగ్నే తమసి శంకరే।

**దిగంబర** : పు. ఇది క్షపణ మతస్థునకును, వస్త్ర విహీనునకును, చీకటికిని, శివునకును పేరు.

పీతాంబరః పద్మనాభే
భవేత్పీతాంబరో నటే॥ (238)

**పీతాంబర** : పు. ఇది విష్ణువుకును, నాట్యగానికిని పేరు.

కాదంబరం తు దధ్యగ్రే
మద్యభేదే చ సీధుని।
కాదంబరీ పరభృతా
భారతీశారికాసు చ॥ (239)

**కాదంబర** : న. ఇది పెరుగుమీగడకును, కదంబ పుష్పములచేత జేయబడిన కల్లుకును, సామాన్యపు కల్లుకును, ఈ. స్త్రీ. ఆడుకోయిలకును, సరస్వతికిని, గోరింకకును పేరు.

ఉదుంబరస్తు దేహళ్యాం
వృక్షజాతౌ చ షండకే।
ఉదుంబరం స్మృతం తామ్రే
కుష్ఠభేదేఽప్యుదుంబరః॥

**ఉదుంబర** : పు. ఇది గడపకును, మేడి చెట్టుకును, నపుంసకునకును, న. రాగికిని, పు. కుష్ఠరోగ విశేషముకును పేరు.

ఔదుంబర శ్శ్రాద్ధ దేవే

**ఔదుంబర** : పు. యమునకును, రోగ విశేషము

రోగభేదే చ కథ్యతే।

కును పేరు.

నీలాంబరః ప్రలంబఘ్నే
కోణపే క్రూరలోచనే॥

**నీలాంబర** : పు. ఇది బలరామునకును, రాక్షసునకును, శనైశ్చరునకును పేరు.

ఆడంబర స్సమారంభే
గజగర్జిత తూర్యయోః।

**ఆడంబర** : పు. తొందరపాటుకును, బృంహిత ధ్వనికిని, చతుర్విధవాద్య ధ్వనికిని పేరు.

నిషద్వరస్తు జంబాలే
నిశాయాంచనిషద్వరీ॥ (242)

**నిషద్వర**: పు. ఇది అడుసునకును, ఈ. స్త్రీ. రాత్రికిని పేరు.

ఉపహ్వారం సమీపే స్యా
దేకాంతే చాప్యుపహ్వారం।

**ఉపహ్వార** : న. ఇది సమీపముకును, రహస్యముకును పేరు.

ఇందీవరం కువలయే
వర్యా మిందీవరీ మతా॥(243)

**ఇందీవర**: న. ఇది కలువకును, ఈ. స్త్రీ. పిల్లి పిచ్చరకును పేరు.

కాలంజరో యోగిచక్ర
మేళకే భైరవే గిరౌ।

**కాలంజర**: పు. ఇది యోగులు సంఘముగా గూడి యుండుటకును, శివునకును, పర్వతవిశేషముకును పేరు.

విశ్వంభరోఽచ్యుతేశక్రే
తథావిశ్వంభరా భువి।

**విశ్వంభర**: పు. ఇది విష్ణువుకును, ఇంద్రునకును, స్త్రీ. భూమికిని పేరు.

దురోదరో ద్యూతకారే
పణే ద్యూతే దురోదరం।

**దురోదర**: పు. ఇది జూదమాడువానికిని, న. పందెముకును, జూదముకును పేరు.

లంబోదరో స్స్యా (దుద్మాతే)దాద్యూనే
గణానా మధిపేఽపి చ॥ (245)

**లంబోదర** : పు. ఇది తనపొట్టను మాత్రము పోషించుకొనువానికిని, విఘ్నేశ్వరునకును పేరు.

అనుత్తర స్మృత శ్రేష్ఠే
ప్రతిజల్ప వివర్జితే।

**అనుత్తర**: త్రి. ఇది శ్రేష్ఠమైనదానికిని, ప్రత్యుత్తరము లేని వాక్యముకును పేరు.

తులధరస్తులారాశౌ
భవేద్వాణిజకేఽపి చ॥ (246)

**తులాధర** : పు. ఇది తులారాశికిని, వర్తకునకును పేరు.

భవేత్తోయధరో మేఘే
సునిషణ్ణౌష ధావపి।

**తోయధర**: పు. ఇది మేఘముకును, చెంచలి కూరకును పేరు.

ధురంధరో ధవతరౌ
ధూర్వహేఽపి ధురంధరః॥

**ధురంధర**: పు. వృక్షవిశేషముకును, త్రి. భారవాహకునకును పేరు.

| | |
|---|---|
| చక్రధరో హరౌ సర్పే<br>వాచ్యవ ద్గ్రామజాలినిః<br>అశ్వతరో వేసరే చ<br>నాగ రాజాంతరేఽపి చ ॥(248) | **చక్రధర** : పు. ఇది విష్ణువుకును, పాముకును, త్రి. అనేక గ్రామములను పాలించువానికిని పేరు.<br>**అశ్వతర**: పు. ఇది కంచర గాడిదకును, దేవయోని, సర్పవిశేషముకును పేరు. |
| విదుర్వీరతర శ్శ్రేష్ఠే<br>శరవీరణయోరపిః<br>నభశ్చరో ఘనే వాతే<br>విద్యాధర విహంగయోః॥ | **వీరతర**: పు. ఇది సమర్థునకును, బాణముకును, న. ఆవురు గడ్డికిని పేరు.<br>**నభశ్చర** : పు. ఇది మేఘమునకును, వాయువుకును, విద్యాధరులను దేవయోని విశేషులకును, పక్షికిని పేరు. |
| ఉద్ధంతుర స్స్యాదుత్తుంగే<br>కరాళో త్కటదంతయోః<br>ద్వైమాతురో జరాసంధ<br>వారణాన నయోర్మతః॥ | **ఉద్ధంతుర**: త్రి. పొడవైన దానికిని, భయంకరమైన దానికిని, మిట్టపండ్ల దానికిని పేరు.<br>**ద్వైమాతుర**: పు. ఇది జరాసంధునకును, విఘ్నేశ్వరునకును పేరు. |
| పరంపరః ప్రపౌత్రాదౌ<br>మృగభేదే పరంపరః<br>పరంపరా పరీపాట్యాం<br>సంతానేఽపి వధే క్వచిత్॥(251) | **పరంపర** : పు. ప్రపౌత్రుడు మొదలుగా గల సంతతికిని మృగవిశేషముకును స్త్రీ. అనుక్రమమునకును, సంతతికిని, వధకును పేరు. |
| అవతారోఽవతరణే<br>తీర్థేజన్మని చేష్యతేః<br>ధరాధరః క్ష్మాభృతి చ క్రపాణౌ<br>ధారాధర స్తోయధరే కృపాణే<br>పయోధర స్స్యాత్కుచ<br>కోశకారక శేరు<br>కాంభో ధరనారికేళే॥ (252) | **అవతార**: పు. ఇది దాటుటకును, నీళ్ళరేవునకును, పుట్టుగకును పేరు.<br>**ధరాధర**:పు. ఇది పర్వతమునకును, విష్ణువుకును పేరు.<br>**ధారాధర** : పు. మేఘముకును, ఖడ్గముకును పేరు.<br>**పయోధర** : పు. ఇది కుచమునకును, చెరుకుల లోని భేదముకును, తుంగముస్తకును, మేఘముకును, టెంకాయకును పేరు. |
| కలికారః కరంజేస్యా<br>ద్ధామ్యాటే పీతమస్తకేః<br>అలంకార స్తూపమాదౌ<br>హారకేయూరకాదిషు॥(253) | **కలికార**: పు. ఇది దుర్గంధముగల క్రానుగు చెట్టు కును, కూకటి మూగపిట్టకును, బంగారు పిచ్చుక కును పేరు.<br>**అలంకార**: పు. ఇది ఉపమాదికావ్యాలంకారములకును, హారాది దేహాలంకారములకును పేరు. |

కర్ణికారశ్చ శంపాకే
కర్ణికారో ద్రుమోత్పలే।
**కర్ణికార** : పు. ఇది రేల చెట్టుకును, కొండగోగు చెట్టుకును పేరు.

రథకారస్తు మాహిష్యా
త్కారణీ జేచతక్షణి॥ (254)
**రథకార** : పు. ఇది వడ్లవానికిని, వడ్రముచేయు వానికిని పేరు.

చర్మకార స్మృతః పాదూ
కృతి చర్మకషౌషధా।
చర్మకారీతి కథితా
**చర్మకార**: పు. ఇది చెమారివానికిని, ఈ. స్త్రీ. సంబ రేణియను ఓషధికిని పేరు.

ప్రతికార స్సమే భటే॥ (255)
**ప్రతికార** : పు. ఇది సమానమునకును, యుద్ధ భటునకును పేరు.

ఘనసారస్తు కర్పూరే
దక్షిణావర్తపారదే।
**ఘనసార** : పు. ఇది కర్పూరమునకును, పాద రసములోని భేదమునకును పేరు.

కృష్ణసారస్స్నుహీవృక్షే
శింశుపామృగభేదయోః॥ (256)
**కృష్ణసార**: పు. ఇది జెముడు చెట్టుకును, నల్ల యిరుగుడు చేవచెట్టుకును, చిత్రవర్ణముగల ఇఱ్ఱికిని పేరు.

గిరిసారో భవేల్లోహే
లింగేమలయపర్వతే।
**గిరిసార** : పు. ఇది ఇనుమునకును, శివలింగము నకును, మలయపర్వతమునకును పేరు.

పీతసారో మలయజే
గోమేధికమణావపి॥ (257)
**పీతసార** : పు. ఇది మంచిగంధపు చెట్టునకును, గోమేధిక మణికిని పేరు.

(సా) శాలసారో ద్రుమేహింగౌ
**శాలసార**: పు. ఇది వృక్షమునకును, ఇంగువకును పేరు.

సూత్రధార శ్శచీపతౌ।
నాంద్యనంతర సంచారి
పాత్ర శిల్పి ప్రభేదయోః॥ (258)
**సూత్రధార**: పు. ఇంద్రునకును, నాంద్యంతమందు నాటక కథాసూచన జేయు పాత్రవిశేషమునకును, శిల్పి జాతివిశేషమునకును పేరు.

దండధరో యమే భూపే
**దండధర**: పు. ఇది యమునకును, రాజునకును పేరు.

సంప్రహారో రణే ,తౌ।
**సంప్రహార**: పు. ఇది యుద్ధమునకును, గమనము నకును పేరు.

ప్రతిహార ప్రతీహా(ర్యౌ) రౌ
ద్వాస్థేద్వారేప్యనంతరే॥ (259)
**ప్రతిహార, ప్రతీహార**: పు. ఇది ద్వారపాలునకును, ద్వారమునకును, వ్యవధి లేకుండుటకును పేరు.

అభిహారో భియోగే చ
చౌర్యే సన్నహనేऽపిచ।
**అభిహార** : పు. అవమానితుడై ప్రభువులయొద్ద ఫిర్యాదు చేయుటకును, దొంగతనమునకును,

| | |
|---|---|
| | సిద్ధముగానుండుటకును పేరు. |
| వ్యవహారో ద్రుభేదే చ<br>వ్యవహారః పణస్థితౌ॥ (260) | **వ్యవహార** : పు. ఇది వృక్షవిశేషముకును, పందెము నకును, ఉనికికిని పేరు. |
| అవహారస్స్మృతశ్చోరే<br>ద్యూతయుద్ధాదివిశ్రమే।<br>నిమంత్రణో హర్తవ్య<br>ద్రవ్యేగ్రాహాఖ్యయాదపి॥ (261) | **అవహార**: పు. ఇది దొంగకును, జూదము మొదలగు వాటియందు విశ్రమించుటకును, నియోగించుట కును, గ్రహించదగిన వస్తువునకును, మొసలికిని పేరు. |
| పరివారః పరిజనే<br>ఖడ్గకోశే పరిచ్ఛదే। | **పరివార** : పు. ఇది పరిజనమునకును, కత్తి వర కును, కప్పియుండు వస్త్రాదులకును పేరు. |
| పారావారస్సముద్రేచ<br>పారావారం తటద్వయే॥ (262) | **పారావార** : పు. సముద్రమునకును, న. ఆవ లీవలి గట్లకును పేరు. |
| అకూపారస్సముద్రే౽పి<br>కూర్మరాజే౽పికీర్తితః। | **అకూపార** : పు. ఇది సముద్రముకును, ఆది కూర్మమునకును పేరు. |
| శిశుమారో౽౦బుసంభూత<br>జంతౌ తారాత్మకాచ్యుతే॥ (263) | **శిశుమార** : పు. ఇది పిడక మొసలికిని, ధ్రువనక్షత్ర సమీపమందుండు నక్షత్రరూపమగు విష్ణువుకును పేరు. |
| సుకుమారస్తుపుండ్రేక్షౌ<br>కోమలే త్వభిధేయవత్। | **సుకుమార** : పు. ఇది నామాల చెరుకునకును, త్రి. మృదువైన దానికిని పేరు. |
| ధుంధుమారశ్శక్రగోపే<br>గృహధూమే పదాలికే॥ (264) | **ధుంధుమార**: పు. ఇది ఆర్ద్రపురుగునకును, ఇంటి పొగకును, అనేక పాదములు గల జంతు విశేషము కును పేరు. |
| కర్ణపూరో౽వతంసే స్యా<br>న్నీలోత్పలశిరీషయోః। | **కర్ణపూర** : పు. ఇది కర్ణాలంకారమునకును, న. నల్లకలువకును, దిరిశెన పువ్వునకును పేరు. |
| కరవీరః కృపాణేచ<br>దైత్యభేదా శ్వమారయోః॥(265)<br>శ్రేష్ఠగవ్యాం పుత్రవత్యా<br>మదితౌకరవీర్యపి। | **కరవీర** : పు. ఇది కత్తికిని, ఈ పేరుగల రాక్షసున కును, వాడగన్నేరు చెట్టుకును, ఈ.స్త్రీ. ఉత్తమ గోవునకును, పుత్రులుగల స్త్రీకిని, దేవమాతకును పేరు. |
| మహావీరః పవౌతార్క్ష్యే<br>శూరే సింహే చ కోకిలే॥(266) | **మహావీర**: పు. ఇది వజ్రాయుధమునకును, గరుడు నకును, శూరునకును, సింహమునకును, కోయి |

| | |
|---|---|
| మఖానలే చ కర్కే చ | లకును, యజ్ఞసంబంధమగు అగ్ని విశేషముకును, |
| మహావీరో జరాటకే। | తెల్ల గుఱ్ఱముకును, సంచానపక్షికిని పేరు. |
| ఆత్మవీరః ప్రాణవతి | **ఆత్మవీర** : పు. ఇది ప్రాణికిని, భార్య తోడబుట్టిన |
| స్యాలే పుత్రే విదూషకే॥(267) | వానికిని, పుత్రునకును, విదూషకునకును పేరు. |
| బార్బటీర స్త్రపా వామ్రా | **బార్బటీర** : పు. ఇది తగరమునకును, మామిడి |
| ష్ట్యంకురే గణికా సుతే। | టెంకకును, మొలకకును, వేశ్యాపుత్రునకును పేరు. |
| చిత్రాటీరో విధౌ ఫాల | **చిత్రాటీర** : పు. చంద్రునకును, ఘంటాకర్ణుడను |
| మంకితం యేన తత్రచ॥ (268) | దేవుని బలికొరకు నరకబడిన పశురక్తముచేత నంకిత |
| ఘంటాకర్ణో పహారాయ | మైన ఫాలముగల వానికిని పేరు. |
| హతఛాగాస్రబిందుభిః। | |
| పాత్రటీరో బుద్ధైరుక్తో | **పాత్రటీర** : పు. ఇది అధికారమును విడిచిన మంత్రి |
| ముక్తవ్యాపారమంత్రిణి॥ (269) | కిని లోహపాత్రమునకును, కంచుగిన్నెకును, |
| లోహకాంస్య రజత్పాత్రే | వెండిగిన్నెకును, గాజుగిన్నెకును, అగ్నికిని పేరు. |
| సిం(ఘా) హాణే పా వకేऽపిచ | |
| ధారాంకురస్తునాసీరే | **ధారాంకుర** : పు. ఇది సేనయొక్క ముందరి భాగ |
| సీకరేచ ఘనోపలే॥ (270) | మునకును, జలకణమునకును, వడగలికిని పేరు. |
| సముద్రారు స్మృతో గ్రాహే | **సముద్రారు** : పు. మొసలికిని, కట్టకును (వారధి |
| సేతుబంధే తిమింగిలే। | యని వాడుదురు) తిమింగిలమను చేపకును పేరు. |
| విశ్వకద్రుస్మృతో ధ్వానే | **విశ్వకద్రు** : పు. ఇది దుష్టునకును, ధ్వనికిని, |
| స్యాదాఖేటికకుర్కురే॥ (271) | వేటకుక్కకును పేరు. |
| అసిపత్రో భవేత్కోశ | **అసిపత్ర** : పు. ఇది చెరుకు చెట్టుకును, నరక |
| కారే చ నరకాంతరే। | విశేషమునకును పేరు. |
| శతపత్రో రాజకీరే | **శతపత్ర** : పు. ఇది చిలుకలలోని భేదమునకును, |
| దార్వాఘాట మయూరయోః॥(272) | వడ్రంగి పిట్టకును, నెమలికిని, న. పద్మమునకును |
| రాజీవే శతపత్రంతు | పేరు. |
| వాతపుత్రోహనూమతి। | **వాతపుత్ర** : పు. ఇది హనుమంతునకును, మిక్కిలి |
| మహాధూర్తే చ భీమే చ | మోసగానికిని, భీమునకును పేరు. |
| లక్ష్మీపుత్ర స్మరే హయే॥(273) | **లక్ష్మీపుత్ర** : పు. మన్మథునకును, అశ్వమునకును పేరు. |

పూర్ణపాత్రం వస్తుపూర్ణ
పాత్రే వర్ధాపకేఽపి చ।

**పూర్ణపాత్ర** : న. ఇది వివాహోద్యుత్సవములయందు వస్త్రాలంకరణాదులచేత నింపింపబడిన పాత్రమునకును, నాడీ విభాగముజేయువానికిని పేరు.

మహామాత్రస్సమృద్ధే స్యా
న్మాత్యే హస్తిపకాధిపే॥ (274)

**మహామాత్ర** : పు. ఇది పరిపూర్ణునకును, మంత్రికిని, మావటివానికిని పేరు.

బిందుతంత్రం విదుస్సారి
ఫలకే చ తురంగకే।

**బిందుతంత్ర** : న. ఇది సొగటాలబల్లకును, పు. అశ్వమునకును పేరు.

రాగసూత్రం తులాసూత్రే
పట్టసూత్రేఽపి దృశ్యతే॥ (275)

**రాగసూత్ర**: న. ఇది తక్కెడ త్రాటికిని, పట్టుదారమునకును పేరు.

తాళపత్రం తు తాటంకే
రండాయాం తాళపత్ర్యపి।

**తాళపత్ర** : న. ఇది చెవికమ్మకును, ఈ. స్త్రీ. ఎలుక చెవి చెట్టుకును పేరు.

అగ్నిహోత్రోఽగ్నిహవిషో

**అగ్నిహోత్ర** : పు. ఇది అగ్నికిని, హోమార్థమైన యన్నమునకును పేరు.

ర్వీతిహోత్రోఽనలార్కయోః॥(276)

**వీతిహోత్ర** : పు. ఇది అగ్నికిని, సూర్యునకును పేరు.

వీరభద్రోఽశ్వమేధాశ్వే
వీరశ్రేష్ఠే చ వీరణే।

**వీరభద్ర**: పు. ఇది అశ్వమేధమందు విడచిన గుఱ్ఱమునకును, మహావీరునకును, అవురు గడ్డికిని పేరు.

పారిభద్రస్తు మందార
నింబ పాదపయోర్మతః॥ (277)

**పారిభద్ర** పు. ఇది పారిజాతవృక్షమునకును, బాడిదపు చెట్టునకును పేరు.

బలభద్రో రౌహిణేయే
త్రాయమాణౌషధావపి।
బలభద్రా కుమార్యం స్యా

**బలభద్ర**: పు. బలరామునకును, స్త్రీ. కలుత్రానుగు చెట్టునకును, కలబంద చెట్టునకును పేరు.

దర్ధచంద్రస్తు చంద్రకే॥ (278)
గళహస్తే బాణభేదే
స్త్రీ ఐంద్రా త్రివృద్ధ్యాదిః

**అర్ధచంద్ర** : పు. నెమలికన్నునకును, మెడపట్టి గెంటుటకును, అర్ధచంద్రాకృతియైన అలుగుగల బాణమునకును, స్త్రీ. నల్ల తెగడకును పేరు.

ధార్తరాష్ట్రస్సితాస్యాంఘ్రి
హంస కౌరవభోగిషు॥ (279)

**ధార్తరాష్ట్ర** : పు. నల్లని ముక్కును, కాళ్ళును గల హంసమునకును, ధృతరాష్ట్రుని పుత్రునకును, సర్పమునకును పేరు.

ధృతరాష్ట్రస్సురాజ్ఞిస్స్యా

**ధృతరాష్ట్ర** : పు. ఇది శ్రేష్ఠమైన రాజునకును, పక్షి

| | |
|---|---|
| త్పక్షి క్షత్రియభేదయోః। | విశేషమునకును, ధృతరాష్ట్రునకును, ఈ. స్త్రీ. |
| ధృతరాష్ట్రీహంసపత్న్యాం | ఆడు హంసకును పేరు. |
| స్థిరదంష్ట్రో భుజంగమే॥ (280) | **స్థిరదంష్ట్ర**: పు. ఇది సర్పమునకును, ఆదివరాహ |
| వరాహాకృతివిష్ణౌచ | మూర్తికిని పేరు. |
| వక్రనక్రశ్శుకే ఖలే। | **వక్రనక్ర**: పు. చిలుకకును, దుర్మార్గునకును పేరు. |
| కటంభరా ప్రసారణ్యాం | **కటంభరా** : స్త్రీ. ఇది గొంతెమగొమరు చెట్టున |
| రోహిణ్యాం గజయోషితి॥(281) | కును, కటకరోహిణికిని ఆడుయేనుగకును, తూటి |
| కలంబికాయాంగోలాయాం | కూరకును, మణిశిలకును, కప్పకును, చాగచెట్టున |
| వర్షాభూమూర్వయోరపి। | కును పేరు. |
| మణిచ్ఛిద్రాతు మేదాయా | **మణిచ్ఛిద్రా** : స్త్రీ. ఇది మేదయను గంధద్రవ్యము |
| మృషభాఖ్యౌషధేఽపిచ॥ (282) | నకును, ఋషభమను ఓషధికిని పేరు. |
| తుంగభద్రానదీ భేదే | **తుంగభద్రా** : స్త్రీ. ఇది నదీవిశేషమునకును, పు. |
| తుంగభద్రో మదోత్కటే। | మదపుటేనుగునకును పేరు. |
| దండయాత్రా దిగ్విజయే | **దండయాత్రా** : స్త్రీ. ఇది దిక్కులను జయించుట |
| సంయానవరయాత్రయోః॥(283) | కును, జంతికెలకును, తోలువారునకును పేరు. |
| దేహయాత్రా భోజనే స్యా | **దేహయాత్రా** : స్త్రీ. ఇది భోజనమునకును, యమ |
| త్కృతాంత గమనేఽపి చ। | పురికి బోవుటకును పేరు. |
| విభావరీ హరిద్రాయాం | **విభావరి** : స్త్రీ. ఇది పసపునకును, రాత్రికిని, |
| రజన్యాంచ విభావరీ॥ (284) | వివాదమునకును, పటుకుటీరమునకును (డేరా) |
| వివాదేవస్త్ర కుట్యాంచ | తార్పుడుకత్తెకును, ఆడుచక్రవాకమునకును పేరు. |
| కుట్టన్యాంచక్రయోషితి। | |
| కుంభకారీకులాల్యాంస్యా | **కుంభకారీ** : స్త్రీ. కుమ్మరి దానికిని, పు. కుమ్మరి |
| త్కుంభకారఃకులాలకే॥ (285) | వానికిని పేరు. |
| తుండికేరీతు కార్పాస్యాం | **తుండికేరీ** : స్త్రీ. ఇది ప్రత్తిచెట్టునకును, దొండ |
| బింబికాయామపీష్యతే। | చెట్టునకును పేరు. |

★ అథరాంతః పంచవర్ణః ★

| | |
|---|---|
| పాంశుచామర ఇత్యేష | **పాంశుచామర**: పు. ఇది గరికిమొలచిన భూమికిని, |
| దూర్వాంచిత తటీభువి॥ (286) | నాడీవిభాగముజేయు వానికిని, స్తుతికిని, రెక్కల |

వర్ధాపకే ప్రశంసాయాం
పురోటౌ ధూళిగుచ్ఛకే।
స్యాత్పాదచ(తు) త్వరశ్చాగే
సైకతే పిప్పలేఽపిచ ॥ (287)
కరకే పరదోషైక
భాజిపూరుషకేఽపి చ।

విప్రతీసారమిచ్ఛంతి
కౌకృత్యేఽనుశయే రుషి॥ (288)
సమభిహారో. భృశార్థే
చ పౌనః పున్యేఽపి కథ్యతే।
పీతకావేరమిచ్ఛంతి
పిత్తళే కుంకుమేఽపి చ॥ (289)
తాలీసపత్రం తాలీశే
తా మలక్యామపి స్మృతం।
భవేదుత్పలపత్రంతు
తద్దళే స్త్రీనఖక్షతే॥ (290)
తమాలపత్రం తాపించే
పత్రకే తిలకేఽపి చ।
సర్వతోభద్ర ఇత్యుక్తః
కావ్యచిత్రే గృహాంతరే॥ (291)
నింబేఽపి సర్వతోభద్రా
గంభారీ నటయోషితోః।
వస్వోకసారా శ్రీదస్య
శక్రస్య నళినీ పురోః॥ (292)
భవేత్కపిలధారాఖ్యా
స్వర్ణదీ తీర్థభేదయోః।

★ అథలాంతో ద్వివర్ణః ★

బలం గంధరసే రూపే

యొక్క ఝంకారధ్వనికిని, వస్త్రములను పరిమళింపజేయు పరిమళచూర్ణమునకును పేరు.

**పాదచత్వర**: పు. ఇది మేకకును, ఇసుకతిన్నెకును, రావిచెట్టుకును, వడగలికిని, పరులదోషముల నెంచెడి వానికిని పేరు.

**విప్రతీసార**: న. ఇది చెడుకార్యమునకును, పశ్చాత్తాపమునకును, దీర్ఘక్రోధమునకును పేరు.

**సమభిహార** : పు. మిక్కిలియనుటకును, మాటిమాటికి యనుటకును పేరు.

**పీతకావేర**: న. ఇది ఇత్తడికిని, కుంకుమమునకును పేరు.

**తాలీసపత్ర**: న. తాళిసపత్రికమునకును, నేలవుశిరిగ చెట్టునకును పేరు.

**ఉత్పలపత్ర** : న. కలువరేకునకును, స్త్రీల నఖక్షత విశేషమునకును పేరు.

**తమాలపత్ర**: న. ఇది చీకటిమానుకును, మకరికా పత్రమునకును, నుదుటి బొట్టునకును పేరు.

**సర్వతోభద్ర**: పు. ఇదిసర్వతోభద్రమనెడిపద్యబంధమునకును, నలువైపులను చావిళ్ళుగల భవంతికిని, వేపచెట్టుకును, స్త్రీ. గుమ్ముడు చెట్టునకును, నాట్యస్త్రీకిని పేరు.

**వస్వోకసారా** : స్త్రీ. ఇది కుబేరుని నదికిని, అలకా పట్టణమునకును, ఆకాశ గంగకును, అమరావతికిని పేరు.

**కపిలధారా** : స్త్రీ. ఇది ఆకాశగంగకును, తీర్థ విశేషమునకును పేరు.

**బల**: న. ఇది బాలింత బోలునకును, రూపమున

| | |
|---|---|
| స్థామని స్థౌల్యసైన్యయోః। | కును, శరీరసామర్థ్యమునకును, లావునకును, |
| బలో హలాయుధేదైత్య | రథాది చతురంగసైన్యమునకును, పు. బలరామున |
| భేదే బలిని వాయసే॥ (1) | కును, బలాసురునకును, బలవంతునకును, కాకి |
| వాట్యాలకే బలాతూక్తా | కిని, స్త్రీ. ముత్తవ పులగపు చెట్టుకును పేరు. |
| పలం తూన్మాన మాంసయోః। | **పల** : న. ఇది నాలుగు కర్షముల యెత్తు తూనికె |
| ఫలం హేతుసముత్థే స్యా | గుండు మొదలగువాటికిని, మాంసమునకును పేరు. |
| త్ఫలకే వ్యుష్టి లాభయోః॥ (2) | **ఫల**: న. ఇది హేతువువలన పుట్టిన ప్రయోజనమున |
| జాతీఫలేఽపి తక్కోలే | కును, సొగసాల బల్లకును, ఫలమునకును, లాభము |
| సస్య బాణాగ్రయోరపి। | నకును, జాజికాయకును, తక్కోల ఫలమునకును, |
| ఫలిన్యాంతు ఫలాప్రాహు | సస్యమునకును, అలుగునకును, స్త్రీ. ప్రేంకణపు |
| స్త్రీఫలాయాం ఫలంక్వచిత్॥ (3) | చెట్టునకును, పు. కరక ఉసిరిక తాణికకును పేరు. |
| జలం గోకలిలే నీరే | **జల**: న. ఇది గోవుయొక్క గర్భమందలి శుక్లశోణిత |
| హ్రీబేరే చ జడేఽన్యవత్। | మిశ్రమగు పిండమునకును, ఉదకమునకును, |
| | కురువేరునకును త్రి. స్తబ్ధునకును పేరు. |
| ఖలం భూస్థాన కల్కేషు | **ఖల** : న. ఇది భూమికిని (కళ్ళము) ప్రదేశమునకును, |
| క్రూరే నీచేఽధమేఖలః॥ (4) | 12 విధములగు శారీర మలమునకును, త్రి. దుర్మార్గున |
| | కును, అల్పునకును, అధమునకును పేరు. |
| గళ స్సర్జ రసే కంఠే | **గళ**: పు. యక్షధూపమనెడి ధూపద్రవ్యమునకును, |
| | కంఠమునకును పేరు. |
| చలః కం(ప్రే) పే చలాశ్రయే। | **చల**: పు. ఇది వణకునకును, త్రి. చలించుదానికిని పేరు. |
| దళం శస్త్రీఛదోత్సేధ | **దళ** : న. ఇది కత్తివరకును, ఔన్నత్యమునకును, |
| తద్ద్రవ్యేఖండ పర్ణయోః॥ | త్రి. ఉన్నతమైన దానికిని, న. తునకకును, ఆకున |
| | కును పేరు. |
| నలః పోటగళే రాజ్ఞి | **నల**: పు. ఇది కిక్కిసగడ్డికి, నలమహారాజునకును, |
| పితృదేవే కపీశ్వరే। | పితృదేవతలలో నొకనికిని, నలుడను వానరున |
| నళీమన శ్శిలాయాంతు | కును, ఈ. స్త్రీ. మణిశిలకును, న. పద్మము నకును |
| కమలే తు నళంమతం॥ (6) | పేరు. |
| తలం స్వరూపాధరయోః | **తల** : న. ఇది ఆకృతికిని, క్రింది భాగమునకును, |

| | |
|---|---|
| ఖడ్గముష్టిచపేటయోః | పు. కత్తిపిడికిని, చెంపకాయకును, నారిదెబ్బ |
| జ్యాఘాతవారణేऽపిస్యా | తగలకుండ చేతికి కట్టుకొనెడి యుడుముతోలు |
| త్తలస్తాళతరావపి॥ (7) | నకును, తాడిచెట్టునకును పేరు. |
| మలంకిట్టేపురీషే చ | **మల** : న. ఇది 12 విధములగు శారీర మలము |
| పాపే చ కృపణేమలః। | నకును, పురీషమునకును, పాపమునకును, పు. లోభికిని పేరు. |
| శలంతుశల్ల కేలోమ్ని | **శల** : న. ఇది ఏదుముంటికిని, పు. తుమ్మెదకును, |
| శలో భృంగే గణే విధౌ॥ (8) | సమూహమునకును, బ్రహ్మకును పేరు. |
| ఖిలం భవేదప్రహతే | **ఖిల** : న. దున్నని భూమికిని (బీడు), సారమును |
| సారసంక్షిప్తవేధసోః। | గ్రహించి క్లుప్తముగా జేయబడిన దానికిని, విష్ణువు నకును పేరు. |
| బిలం ఛిద్రే గుహాయాంచ | **బిల** : న. ఇది రంధ్రమునకును, గుహకును, పు. |
| బిల ఉచ్చైశ్రవాహయే॥ | ఉచ్చైశ్రవమను ఇంద్రాశ్వమునకును పేరు. |
| ఛలం తు స్ఖలితే వ్యాజే | **ఛల** : న. యుద్ధమందు వెనుదీయుటకును, మిష కును పేరు. |
| పులం తు విపులేऽన్యవత్। | **పుల**: త్రి. ఇది విస్తారమైనదానికిని, పు. గగుర్పాటు |
| పులస్త్యేత్పులకే చాపి | నకును పేరు. |
| కులం జనపదే గృహే॥ (10) | **కుల** : న. ఇది దేశమునకును, గృహమునకును, |
| సజాతీయగణే గోత్రే | సజాతీయప్రాణిసంఘమునకును, వంశమున |
| దేహే పికథితం కులం। | కును, శరీరమునకును పేరు. |
| కాలో మృత్యౌ మహాకాలే | **కాల** : పు. ఇది మృత్యువునకును, శివునకును, |
| సమయే యమ కృష్ణయోః॥(11) | కాలమునకును, యమునకును, నీలవర్ణమున |
| కృష్ణత్రివృతి కాలాతు | కును, స్త్రీ. నల్లతెగడకును, నీలిచెట్టుకును, మంజిష్ఠ |
| నీలిమంజిష్ఠయోరపి। | యను గంధద్రవ్యమునకును, ఈ. స్త్రీ. పార్వతికిని, |
| కాళీగౌర్యాంక్షీరకీటే | పాలవలన ఖుట్టు క్రిమి విశేషమునకును, కాళికాదేవి |
| కాళికామాతృభేదయోః॥ (12) | కిని (అనగా పార్వతి లలాటమందు ఖుట్టుశక్తి) |
| నవాంబువాహబృందేऽపి | మాతృకావిశేషమునకును, నూతన మేఘమాల |
| ప(రి) రీవాదేऽపి చ క్వచిత్। | కును, అపవాదమునకును పేరు. |

భా(ఫా)లం లలాట మహసోః
కాలస్కంధ మహీరుహే ॥ (13)

**భాల**: న. ఇది నుదుటికిని, తేజస్సునకును, చీకటి మానునకును పేరు.

శాలో హాలనృపే మత్స్య
ప్రభేదే సర్జ క ద్రుమే।
శాలాగృహే తరుస్కంధ
శాఖాగారైక దేశయోః॥ (14)

**శాల** : పు. ఇది శాలివాహనుడను రాజునకును, ఉరుజమీనునకును, ఏపిచెట్టుకును, స్త్రీ. గృహము నకును, చెట్టు మొదటి కొమ్మకును, చావడికిని పేరు.

మాలంక్షేత్రే జనేమాలో
మాలాపుష్పాదిదామని।

**మాల** : న. ఇది ఈ పేరుగల మెట్టభూమికిని, పు. మనుజునకును, స్త్రీ. పుష్పాదులదండకును పేరు.

సాలః పాదపమాత్రేపి
ప్రాకారేసర్జకద్రుమే॥ (15)

**సాల**: పు. ఇది వృక్షసామాన్యమునకును, ఆవరణ మునకును, ఏపి చెట్టునకును పేరు.

తాలః కరతలేऽంగుష్ఠ
మధ్యమాభ్యాం చ సమ్మితే
గీతకాల క్రియామానే
తాలః ఖడ్గాదిముష్టిషు॥(16)
ద్రుమభేదే కరాస్ఫాలే
తాళంతు హరితాళకే।
వాద్యభాండేపికాంస్యస్య
తాళచ్ఛదిషి కంపనే॥ (17)

**తాల** : పు. ఇది హస్తపుటమునకును, లొడితెడు ప్రమాణమునకును, అటాది తాళములకును, కత్తి మొదలగువాటి పిడికిని, తాడిచెట్టునకును, చేతులు చరచుటకును, న. అరదళమునకును, వాయించు కుండకును, కంచుతాళపు చిప్పకును, చలించుట కును పేరు.

జాలం గవాక్ష ఆనాయే
కోరకే దంభబృందయోః।.
జాలో నీపద్రుమే జాలీ
కోశాత క్యాముదాహృతా॥

**జాల** : న. ఇది కిటికీకిని, వలకును, మొగ్గకును, కపటమునకును, సమూహమునకును, పు. కడిమి చెట్టునకును, ఈ. స్త్రీ. పొట్లతీగకును పేరు.

వ్యాళో భుజంగమే క్రూరే
శ్వాపదేదుష్టదంతిని।

**వ్యాళ**: పు. ఇది సర్పమునకును, క్రూరునకును, పెద్ద పులికిని, దుష్ట స్వభావముగల యేనుగునకును పేరు.

నాళందండే సరోజాదే
ర్నాళీ శాకక(డం)లంబకే॥(19)

**నాళ** : న. ఇది పద్మాదుల కాడకును, ఈ. స్త్రీ. శాకములతొడిమెకును పేరు.

స్థాలం భాజనభేదేऽపి
స్థాలీస్యాత్పాటలోఖయోః।

**స్థాల**: న. ఇది భోజనపాత్రమునకును, ఈ. స్త్రీ. కలిగొట్టు చెట్టునకును, వంటకుండకును పేరు.

ఫాలం సీరోపకరణే
కార్పాసాదికవాససి॥ (20)
బాలః కచే శిశౌ మూర్ఖే
హ్రీబేరే శ్వభపుచ్ఛయోః।
అలంకారాంతరే మేధా
బాలీ బాలాత్రుటిస్త్రియోః॥(21)
చేలో నీచేఽన్యవచ్చేల
మంశుకే గర్హితేఽన్యవత్।
భేలః ప్లవే భీరుకే చ
నిర్బుద్ధిమునిభేదయోః॥(22)
కోలః కపాలఉత్సంగే
భేలకే పోత్రిచిత్రయోః।
కోలాకణాయాం చవ్యే చ
కోలం తు బదరీఫలే॥ (23)
శైలో భూభృతి శైలంతు
శైలేయే తార్క్ష్యశైలకే।
శీలం స్వభావే సద్వృత్తే
నీలః కృష్ణేనగాంతరే॥ (24)
నీలః కపీశ్వరే నీలీ
వృక్షలాంఛనభేదయోః।

కూలంస్తూపే తటాకేచ
సైన్యపృష్ఠప్రతీరయోః॥ (25)
తూలః పిచౌ భవేత్తూలం
బ్రహ్మదారు విహాయసోః।
మూలమాద్యేశిఫాయాంస్యా
ద్భునికుంజాంతికేషు చ ॥(26)

**ఫాల** : న. ఇది నాగటి కఱ్ఱునకును, నూలు మొదలగువాటితో నేసిన వస్త్రమునకును పేరు.

**బాల:** పు. ఇది జుట్టునకును, త్రి. పిల్లవానికిని, మూర్ఖునకును, కురువేరునకును, పు. గుఱ్ఱపుతోకకును, ఏనుగు తోకకును, ఈ. స్త్రీ. ఉంగరమునకును, మేడితోకకును ఆ. స్త్రీ. త్రుటికాలమునకును, స్త్రీకిని పేరు.

**చేల** : స్త్రీ. అధమునకును, న. వస్త్రమునకును, త్రి. నిందింపదగిన దానికిని పేరు.

**భేల** : పు. ఇది తెప్పకును, స్త్రీ. భయ స్వభావము గలవానికిని, బుద్ధిహీనునకును, భేలమునికిని పేరు.

**కోల** : పు. ఇది పుఱ్ఱెకును, ఉపరిభాగముకును, తెప్పకును, పందికిని, చిరుత పులికిని, స్త్రీ. నల్లజీలకఱ్ఱకును, చవ్యమను గంధద్రవ్యమునకును, న. రేగు పండునకును పేరు.

**శైల** : పు. ఇది పర్వతమునకును, న. రాతి పువ్వునకును, రసాంజనమునకును పేరు.

**శీల:** న. ఇది స్వభావమునకును, సద్వ్యాపారమునకును పేరు.

**నీల** : పు. ఇది నలుపునకును, నీల పర్వతమునకును, నీలుఁడను వానరునకును, ఈ. స్త్రీ. నీలిచెట్టుకును, చిహ్నమునకును పేరు.

**కూల:** న. ఇది దిబ్బకును, చెరువునకును, సేనకు వెనుకటి భాగమునకును, ఒడ్డునకును పేరు.

**తూల:** పు. ఇది దూదికిని, న. గంగరావిచెట్టుకును, ఆకాశమునకును పేరు.

**మూల:** త్రి. ఇది మొదటి దానికిని, న. వేరునకును, మూలా నక్షత్రమునకును, పొదరింటికిని, సమీపమునకును పేరు.

శూలం ప్రహరణేమృత్యౌ
కేతనే రోగయోగయోః।
శూలా దుష్టవధార్థాయ
కీలకే పణ్యయోషితి॥ (27)

**శూల:** న. ఇది శూలాయుధమునకును, మృత్యువునకును, ధ్వజమునకును, శూలరోగముకును, 5వ పంచాంగ యోగమునకును, స్త్రీ. కొఱతవేయు శూలమునకును, వెలయాలికిని పేరు.

స్థూలం స్యాత్పీవరే కూటే
నిష్ప్రజ్ఞే పునరన్యవత్।

**స్థూల:** త్రి. ఇది బలిసిన దానికిని, న. సమూహమునకును, మందబుద్ధికిని పేరు.

అమ్లో రసప్రభేదే స్యా
దమ్లీచాంగేరికౌషధౌ॥ (28)

**అమ్ల:** పు. ఇది పులుసునకును, ఈ. స్త్రీ. పులిచింతకును పేరు.

శుక్లో యోగాంతరే శ్వేతే
శుక్లం రజత రేతసోః।

**శుక్ల:** పు. ఇది పంచాంగయోగ విశేషమునకును, తెలుపునకును, న. వెండికిని, రేతస్సునకును పేరు.

మల్లః పాత్రే కపోలే చ
మత్స్యభేదే బలీయసి॥ (29)

**మల్ల:** పు. ఇది ప్రమిదెకును, గండ ప్రదేశమునకును, మత్స్యవిశేషమునకును, జెట్టివానికిని పేరు.

భల్లో భల్లీ చ బాణే స్యా
ద్భల్లో భల్లూక-ఇష్యతే।
భల్లాతక్యాం చ (ఫ) భల్లీస్యా
త్కాల అర్ద్రే చ సూరణే॥(30)

**భల్ల:** స్త్రీ. ఇది బాణమునకును, పు. ఎలుగునకును, ఈ. స్త్రీ. జీడి చెట్టునకును, కాలవునకును, అల్లమునకును, కందగెడ్డకును పేరు.

చుల్లచిల్లౌ మతౌక్లిన్న
నేత్రే క్లిన్నాక్షి పిల్లవత్।
ఆతాపి నిభవే చ్చిల్ల
శ్చిల్లీస్యాద్గౌడవాస్తుకే॥ (31)

**చుల్ల, చిల్ల, పిల్ల:** స్త్రీ. ఈ 3ను పుసికండ్లవానికిని, పుసికండ్లకును పేరు. ఇందు **చిల్ల:** పు. ఇది చిందపిట్టకును పేరు. **చిల్లి:** స్త్రీ. ఇది చక్రవర్తికూరకు పేరు.

చుల్లీ చితాయాముద్ధానే
క్వచిద్వాద్యే ప్యుదీరితా।

**చుల్లి:** స్త్రీ. ఇది చితికిని, పొయ్యికిని, వాద్య విశేషమునకును పేరు.

వల్లీ వీరుధి సంతానే
వల్కాలే కుసుమాంతరే॥ (32)

**వల్లి:** స్త్రీ. ఇది లతకును, సంతతికిని, నారచీరకును, పుష్ప విశేషమునకును పేరు.

ఖల్లీ హస్తపాదావ
మర్ద నాఖ్యరుజి స్మృతా।
ఖల్లో వస్త్రప్రభేదేస్యా
న్నిమ్నే చర్మణి చాతకే॥ (33)

**ఖల్లి:** స్త్రీ. ఇది రోగవిశేషమునకును, పు. వస్త్ర విశేషమునకును, పల్లమునకును, తోలునకును, చాతక పక్షికిని పేరు.

| | |
|---|---|
| ఆలు ర్గలంతికాయాం చ | **ఆలు** : పు. గఱిగ పిడతకును, న. ఈ పేరుగల |
| కందభేదేఽపి భేలకే। | దుంపకును, తెప్పకును పేరు. |
| పీలు ర్గజే ద్రుమే కాండే | **పీలు**: పు. ఇది ఏనుగునకున, గోగుచెట్టునకును, |
| పరమాణు ప్రసూనయోః॥(34) | బాణమునకును, లోకమందు దేనికంటె చిన్న |
| పీలుస్తాలా స్థిఖండే చ | వస్తువులేదో దానికిని, పుష్పమునకును, తాటితుం |
| | డునకును పేరు. |
| మాలుః పత్రలతా స్త్రియోః। | **మాలు**: పు. ఇది మకరికాపత్రమునకును, స్త్రీకిని పేరు. |
| (సా) శాలుః కషాయద్రవ్యేఽస్యా | **శాలు**: పు. ఇది వగరు వస్తువునకును, చోరకమను |
| చ్చోరకాఖ్యౌషధేఽపి చ॥(35) | ఓషధికిని పేరు. |
| బలి శ్చామరదండే (ఽపి) చ | **బలి**: పు. ఇది సురటీ కఱ్ఱకును (పిడి) స్త్రీ. ముదిసిన |
| జరయా శ్లథచర్మణి। | చర్మమునకును, కడుపుమీది ముడతలకును, పు. |
| ఉదరావయవే దైత్యే | బలిచక్రవర్తికిని, పన్నునకును, పూజార్థమైన ద్రవ్య |
| కరపూజో పహారయోః॥(36) | మునకును, పంచమోపు కట్టుకును, గంధకము |
| గృహదారు విశేషే చ | నకును పేరు. |
| గంధకే చ క్వచిన్మతః। | |
| డోలా యానాంతరే నీల్యాం | **డోలా** : స్త్రీ. ఇది ఉయ్యాలకును, నీలిచెట్టుకును పేరు. |
| మేలాస్యాన్మేలకేమషౌ॥ (37) | **మేలా** : స్త్రీ. కలయికకును, మసికిని పేరు. |
| ఇలా కళత్రే సౌమ్యస్య | **ఇలా** : స్త్రీ. ఇది బుధుని భార్యకును, భూమికిని, |
| ధరిత్ర్యాం గవి వాచిచ। | గోవునకును, వాక్కునకును పేరు. |
| కీలా కఫోణినిర్ఘా తే | **కీలా** : స్త్రీ. మోచేతిదెబ్బకును, మేకునకును, స్త్రీ. |
| శంకౌ జ్వాలే చ కీలవత్॥(38) | అగ్నిజ్వాలకును పేరు. |
| శిలా కునట్యాం దృషది | **శిలా** : స్త్రీ. ఇది నేపాళమణిశిలకును, రాతికిని, |
| ద్వారాధస్థితదారుణి। | గుమ్మము క్రింది త్రొక్కుడు పలకకును, న. |
| శిలంశిలీ భవేదుంఛే | ఉంఛవృత్తికిని, ఈ. స్త్రీ. ఆడుయెట్టుకును పేరు. |
| గండూపద్యాం యథాక్రమం॥(39) | |
| తులా పలశతే రాశౌ | **తులా** : స్త్రీ. ఇది నూరుపలములయెత్తు తూనిక |
| భాండే సాదృశ్య మానయోః। | గుండునకును, తులారా కుండకును, సామ్య |
| గృహాణాం దారుబద్ధాయాం | మునకును, త్రాసునకును, ఇంటి దూలముల |

| | |
|---|---|
| పీఠికా యామపీష్యతే॥ (40) | అడుగునవేసెడి పీటుదిమ్మకును పేరు. |
| వేలా కాలే చ జలధే | **వేలా :** స్త్రీ. ఇది సమయమునకును, చెలియలి కట్టకును, ఉప్పెనకును, అనాయాసమరణమునకును, అనురాగమునకును, పొలిమేరకును, వాక్కునకును, బుధుని భార్యకును, ప్రభువుల యొక్క భోజనమునకును పేరు. |
| స్త్రీర నీర వికారయోః। | |
| అక్లిష్టమరణే రాగే | |
| సీమ్నివాచి బుధస్త్రియాం॥(41) | |
| భోజనే పీశ్వరాణాం స్యా | |
| ఝ్ఝులా దుహితరిస్మృతా। | **ఝులా :** స్త్రీ. కుమార్తెకును, ఎండమావులకును, ఈ. స్త్రీ. జలగకును పేరు. |
| ఆతపోర్మౌ జలూకాయాం | |
| ఝూలీ క్వాపి విలోక్యతే॥ (42) | |
| కలా స్యాన్మూలరైవృద్ధౌ | **కలా :** స్త్రీ. ఇది వడ్డికిని, శిల్పము మొదలగు విద్యలకును, భాగమునకును, చంద్రునియందు **16**వ భాగమునకును, కూర్పుటకును, **9** ఘడియల కాలమునకును, న. రేతస్సునకును, పు. అజీర్ణరోగమునకును, అవ్యక్తమధుర ధ్వనికిని పేరు. |
| శిల్పాదా వంశమాత్రకే। | |
| షోడశాంశే చ చంద్రస్య | |
| కలనా కాలభేదయోః॥(43) | |
| కలం శుక్రే కలోऽజీర్ణే | |
| ప్యవ్యక్తమధురధ్వనౌ। | |
| లోలా జిహ్వాకమలయో | **లోలా :** స్త్రీ. ఇది నాలుకకును, లక్ష్మికిని, త్రి. చంచలమైన దానికిని, అభిలాషతోగూడిన దానికిని పేరు. |
| ర్లోల శ్చలసతృష్ణయోః॥ (44) | |
| లీలాం విదుః కేళి | **లీలా :** స్త్రీ. ఇది ఆలింగనాది క్రీడకును, చిత్తవిక్రియా విశేషమునకును, వినోదార్థమైన యాటకును, శృంగార చేష్టకును పేరు. |
| విలా స ఖేలా శృంగార। | |
| భావ ప్రభవక్రియాసు | |
| హేలా మవజ్ఞాన విలాసయోశ్చ | **హేలా :** స్త్రీ. ఇది తిరస్కారమునకును, స్త్రీల విలాసమునకును పేరు. |
| హాలా సురాయాం నృపతౌ చ హాలః॥(45) | **హాలా :** స్త్రీ. ఇది కల్లునకును, హాల రాజునకును పేరు. |
| గోలా సఖీ వర్తులయో | **గోలా :** స్త్రీ. ఇది చెలికత్తెకును, త్రి. వట్రువయైన దానికిని న. పత్రాంజనమునకును, (మసి) నేపాళ దేశపు మణిశిలకును, స్త్రీ. గోదావరీ నదికిని, న. మండలాకారమునకును పేరు. |
| ర్గోలం లక్ష్యానుసారతః। | |
| పత్రాంజనే కునట్యాం చ | |
| గోదావర్యాం చ మండలే॥ (46) | |
| అళిస్సురాపుష్పలిహోః | **అళి :** స్త్రీ. ఇది కల్లునకును, తుమ్మెదకును పేరు. |

ఆళిస్తు విశదాశయే।
ఆళిః పంక్తౌ చ సఖ్యాం చ
సేతౌ చ పరికీర్తితా॥ (47)

**ఆళి :** ఇది నిర్మలాంతఃకరణము గల వానికిని, స్త్రీ. వృక్షాదులవరుసకును, చెలికత్తెకును, ప్రవాహాది బంధనమునకును పేరు.

కలి స్స్యాత్కలహే శూరే
కలిరంత్యయుగే యుధి।
ధూళి స్సంఖ్యాంతరే రేణౌ

**కలి :** పు. ఇది వివాహమునకును, శూరునకును, కలియుగమునకును, యుద్ధమునకును పేరు.
**ధూళి :** స్త్రీ. ఇది సంఖ్యాభేదమునకును, పరాగమునకును పేరు.

దులిస్తు కమఠే మునౌ॥ (48)
మౌళిః కిరీటే ధమ్మిల్లేకం
కేళిద్రుమ చూడయోః।
శాలిస్తు గంధమార్జారే
కలమాదిషు చ స్మృతః॥ (49)
పాళిః కర్ణలతాగ్రేఽశ్రౌ
పంక్త్యావంక ప్రదేశయోః।
పాళిః ప్రష్ఠే చ యూకాయాం
జాతశ్మశ్రుస్త్రియామపి॥(50)
ఝిల్లీ స్యాదాతపరుచౌ
వర్త్యా ముద్వర్తనాంశుకే।
వల్లీ స్యాదజమోదాయాం
పుష్పభేదేఽపి వీరుధి॥(51)
పల్లీ కుటీ గ్రామకయోః
పల్ల స్స్యాలకుసూలకే।
తల్లీ తలున్యాం తల్లస్తు
జలాధారాంతరేఽపి చ॥ (52)

**దులి :** పు. ఇది తాబేటికిని, దులి మహామునికిని పేరు.
**మౌళి :** ఇది కిరీటమునకును, కొప్పునకును, పు. అశోకవృక్షమునకును, మగవాని జుట్టునకును పేరు.
**శాలి :** పు. ఇది జవ్వాది పిల్లికిని, వరి మొదలగు సస్యములకును పేరు.
**పాళి :** స్త్రీ. ఇది చెవి తమ్మికిని, ఆయుధ ధారకును, వరుసకును, ప్రదేశమునకును, కొండ చరియకును, పేనుకును, ముఖరోమములు గల స్త్రీకిని పేరు.
**ఝిల్లి :** స్త్రీ. ఇది యెండయొక్క కాంతికిని వత్తికిని, వస్త్ర విశేషమునకును పేరు.
**వల్లీ :** స్త్రీ. ఇది ఓమమునకును, పుష్ప విశేషమునకును, లతకును పేరు.
**పల్లీ :** స్త్రీ. ఇది గుడిశెకును, అల్పగ్రామమునకును, అ. ధాన్యపు పౌణకకును పేరు.
**తల్లి :** స్త్రీ. ఇది యౌవన స్త్రీకిని, అ. పు. తటాకమునకును పేరు.

### ★ అథ లాంత త్రివర్గః ★

కమలం సలిలే తామ్రే
జలజే క్లోమ్ని భేషజే।

**కమల :** న. ఇది జలమునకును, రాగికిని, పద్మమునకును, వక్షమందలి కుడి ప్రక్కనుండు మాంస

మృగభేదేఽపి కమలః
కమలా శ్రీవరస్త్రియోః॥ (53)

విశేషమునకును, పు. జింకలలోని భేదమునకును, స్త్రీ. లక్ష్మికిని, ఉత్తమ స్త్రీకిని పేరు.

చపలః పారదే మీనే
చోరకే ప్రస్తరాంతరే।
చపలో వానరే నీచే
దుర్వినీతేఽనవస్థితే॥ (54)
చపలం క్షణికే శీఘ్రే
చపలశ్చికురే చలే।
చపలా కమలా విద్యు
త్పుంశ్చలీ పిప్పలీషు చ॥ (55)

**చపల :** పు. ఇది పాదరసమునకును, చేపకును, చండయను గంధద్రవ్యమునకును, ఒక విధమగు జాతికిని, కోతికిని, త్రి. నీచునకును, దుర్మార్గునకును, సంచరించు దానికిని, న. క్షణమునకును, శీఘ్రమునకును, పు. జుట్టునకును, త్రి. చలించు దానికిని, స్త్రీ. లక్ష్మికిని, మెఱుపునకును, కులటకును, పిప్పలితీగకును పేరు.

ఉపలః ప్రస్తరే రత్నే
శర్కరాయాం స్మృతోపలా
ఉత్పలం మాంసశూల్యే స్యా
త్కుష్ఠం దీవరయోరపి॥ (56)

**ఉపల :** పు. ఇది జాతికిని, రత్నమునకును, స్త్రీ. మొఱపజాతికిని పేరు.

**ఉత్పల :** న. ఇది కాల్చుటకైమాంసపు ఖండమును గ్రుచ్చిన యినుపశలాకకును, కుష్ఠరోగమునకును, నల్ల కలువకును పేరు.

అనలో వసుభేదే గ్నా
వనిలో వసువాతయోః।

**అనల:** పు. అష్టవసువులలో నొకనికిని, అగ్నికిని పేరు.

**అనిల:** పు. అష్టవసువులలో నొకనికిని, వాయువునకును పేరు.

శకలం త్వచి ఖండే స్యా
ద్రాగవస్తుని వల్కలే॥ (57)
గరళం తు విషే మానే
గరళం తృణపూలకే।
తరళ శ్చపలే షిద్గే
హారమధ్యమణావపి॥ (58)
భాసురే చాథ తరళా
యవానీ సురయోర్మతా।
సరళః పూతికాష్ఠే స్యా
దుదారా వక్రయోరపి॥ (59)

**శకల :** న. ఇది చర్మమునకును, తునకకును, రంజక ద్రవ్యమునకును, నారచీరకును పేరు.

**గరళ :** న. ఇది విషమునకును, పరిమాణమునకును, గడ్డిమోపునకును పేరు.

**తరళ :** త్రి. చంచలమైన దానికిని, జారునకును, పు. నాయకమణికిని, త్రి. మెఱయునట్టి దానికిని స్త్రీ. గంజికిని, కల్లునకును పేరు.

**సరళ :** పు. ఇది సరళ దేవదారు చెట్టునకును, త్రి. గంభీరమైన దానికిని, తిన్నని దానికిని పేరు.

కపిలో మునిభేదే స్యా
త్పావకే పారతంత్రకే।
కపిలా శింశుపాయాం చ
రేణుకా గోవిశేషయోః॥ (60)
పుండరీక కరిణ్యాం చ
పింగే తు కపిలోఽన్యవత్।

**కపిల** : పు. ఇది కపిలమహామునికిని, అగ్నికిని, కుక్కకును, స్త్రీ. కంపుయిరుగుడు చెట్టుకును, రేణుకయను గంధద్రవ్యమునకును, కపిలగోవునకును, పుండరీకమను, దిగ్గజముయొక్క భార్యకును, త్రి. కపిలవర్ణముగల దానికిని పేరు.

పలలం తిలచూర్ణే స్యా
త్పలలం పంకమాంసయోః॥ (61)
పలలో యాతుధానే స్యాత్

**పలల** : న. ఇది తెలకపిండికిని, బురదకును, మాంసమునకును, పు. రాక్షసునకును పేరు.

పటలం ఛదిష్వ్రజే।
పిటకే నేత్రరోగే చ
తిలకే చపరిచ్ఛదే॥ (62)

**పటల**: న. ఇది ఇంటికప్పునకును, సమూహమునకును, కురుపుబొబ్బకును, నేత్రరోగమునకును, నుదుటిబొట్టునకును, పరివారమునకును పేరు.

జగలః పిష్టమద్యే చ
మేదకే మదనద్రుమే।
కితవే ఛగల శ్ఛాగే
ఛగలీ ఛాగమాతరి॥ (63)
వృద్ధదారక భైషజ్యే
ఛగలం నీలవాససి।

**జగల**: పు. ఇది పిండిచేత జేయబడిన కల్లునకును, కల్లుమడ్డికిని, మంగచెట్టునకును, త్రి. మోసగానికిని పేరు.

**ఛగల**: పు. ఇది మేకకును, ఈ. స్త్రీ. ఆడుమేకకును బొడ్డిచెట్టునకును, న. నల్ల బట్టకును పేరు.

పిప్పలో బోధివృక్షే స్యా
త్పక్షిభేదే నిరంగుళే॥ (64)
పిప్పలం వసనచ్ఛేద
ప్రభేదే సలిలే మతం।
కణాయాం పిప్పలీప్రోక్తా

**పిప్పల**: పు. రావిచెట్టునకును, పక్షివిశేషముకును, (బాతు అని కొందరు) వ్రేళ్లు లేని వానికిని, న. గుడ్డకును, ఉదకమునకును, ఈ. స్త్రీ. పిప్పలి తీగకును పేరు.

ధవళస్సుందరే సితే॥ (65)
మహోక్షే చాథ ధవళీ
సౌరభేయ్యా ముదీరితా।

**ధవళ** : త్రి. ఇది సుందరమైన దానికిని, తెల్లని దానికిని, పు. ఆబోతునకును, ఈ. స్త్రీ. తెల్లని యావునకును పేరు.

కువలం చోత్పలే ముక్తా
ఫలేఽపి బదరీఫలే॥ (66)

**కువల** : న. ఇది కలువకును, ముత్తెమునకును, రేగుపండునకును పేరు.

కుశల శ్శిక్షితే క్షేమ
పర్యాప్తి సుకృతేషుచ। కుశలం

**కుశల** : త్రి. ఇది నేర్పరికిని, న. క్షేమమునకును, సమృద్ధికిని, పుణ్యమునకును పేరు.

ముసలం తుస్యాదయోఽగ్రే
ముసలీ మతా॥(67) తాళమూల్యా
మాఖుపర్ణీ గృహగోధికయోరపి

**ముసల** : న. ఇది రోకలికిని, ఈ. త్రీ. నేలతాడి చెట్టునకును, ఎలుకచెవిచెట్టునకును, బల్లికిని పేరు.

నిచుళో హిజ్జలతరౌ
నిచుళస్తు నిచోలకే॥ (68)
నిచుళః కవిభేదే స్యా
ద్వానీరే స్థలవేతసే।

**నిచుళ**: పు. ఇది గన్నేరుచెట్టునకును, గవిసెనకును (బురకా) నిచుళకవికిని, నీటి ప్రబ్బ(లి) చెట్టునకును, మెట్టప్రబ్బ చెట్టుకును పేరు.

పిచులో ఝాబుకేతూలే
హిజ్జలే జలవాయసే॥ (69)

**పిచుల**: పు. ఇది సన్నపాకుల ప్రక్కె చెట్టునకును, దూదికిని, గన్నేరుచెట్టునకును, నీటికాకికిని పేరు.

విపులః పృథులేఽగాధే
మేరు పశ్చిమ భూధరే।

**విపుల** : త్రి. ఇది విస్తారమైన దానికిని, లోతైన దానికిని, పు. మేరు పశ్చిమభాగమందలి విపుల పర్వతమునకును పేరు.

తుములః కలివృక్షే స్యా
త్తుములం రణసంకులే॥(70)

**తుముల** : పు. ఇది తాండ్ర చెట్టునకును, న. యుద్ధమందలి గొల్లునకును పేరు.

బహుళః కృష్ణపక్షేఽగ్నౌ
వసితే బహుళాగవి।
ఏలాయాం నీలికాయాం చ
బహుళాః కృత్తికాసుచ॥ (71)
బహుళం ప్రాజ్య నభసో

**బహుళ**: పు. ఇది కృష్ణపక్షమునకును, అగ్నికిని, నలుపువర్ణమునకును, త్రీ. గోవునకును, ఏలకిలతకును, నీలిచెట్టునకును, నిత్య బహువచనమునకును, కృత్తికానక్షత్రమునకును, త్రి. విస్తారమైన దానికిని, న. ఆకాశమునకును పేరు.

ర్మాతులో మదనద్రుమే।
మాతుర్భ్రాతరి ధుత్తూరే
వ్రీహిభేదేఽపి మాతులః॥ (72)

**మాతుల**: పు. ఇది మంగచెట్టునకును, మేనమామకును, ఉమ్మెత్తచెట్టునకును, ధాన్య విశేషమునకును పేరు.

కుటిలం వాచ్యవద్భుగ్నే
కుటిలా సరిదంతరే।

**కుటిల** : త్రి. ఇది వంకరయైన దానికిని, త్రీ. నదీ విశేషమునకును పేరు.

జటిలస్తు జటాయుక్తే
జటిలా మాంసి కౌషధౌ॥ (73)

**జటిల** : త్రి. ఇది జటలుగల దానికిని, త్రీ. జటామాంసికిని పేరు.

సుతల ప్రతలౌ చేతి
పాతాలభువనద్వయే।
స్యాతామట్టాలికాబంధే
తతాంగుళికరే క్రమాత్॥ (74)

**సుతల** : పు. ఇది సుతలమనెడి యధోలోకమునకును, కోటవాకిటిమీది యింటికిని పేరు. **ప్రతల**: పు. ఇది ప్రతలమనెడి యధోలోకమునకును, చాచిన వ్రేళ్ళుగల హస్తమునకును పేరు.

పిత్తళం త్రై జసద్రవ్యే
పిత్తళః పిత్తసంగతే।
పిత్తళాతో యపిప్పల్యాం
నిస్తలంవర్తు లే చలే॥(75)

**పిత్తళ** : న. ఇది ఇత్తడికిని, త్రి. పైత్యోద్రేకముగలవానికిని, స్త్రీ. నీటిపిప్పలికిని పేరు.

**నిస్తల** : త్రి. ఇది వర్తులవయ్యైన దానికిని, చలించుదానికిని పేరు.

కుంతల స్స్యాద్యవే దేశే
కేశ లాంగలయోరపి।
కంబళో నాగరాజేస్స్యా
ద్గజప్రావరణే కృమౌ॥(76)
కంబళశ్చోత్తరాసంగే
కంబళం సలిలే మతం।

**కుంతల**: పు. ఇది యవధాన్యమునకును, కుంతలదేశమునకును, వెంట్రుకలకును, నాగలికిని పేరు.
**కంబళ** : పు. సర్పవిశేషమునకును, ఏనుగుమీద పరచెడు చిత్రకంబళికిని, కంబళీపురుగునకును, ఉత్తరీయమునకును, న. ఉదకమునకును పేరు.

శంబళం కూల పాథేయ
మత్సరేషు సమీరితం॥ (77)
కందళంతు కపాలే స్యా
దుపరాగే నవాంకురే।
కలధ్వనౌ కందళీతు
మృగవృక్ష విశేషయోః॥(78)
పింగళ స్స్యాన్మునౌ రుద్రే
చండాంశోః పారిపార్శ్వకే।
నిధి భేదే క పావగ్నౌ
పింగళః కపిలే ऽన్యవత్ ॥(79)
కర్ణికాయాం చ వేశ్యాయాం
పింగళాకుముద స్త్రియాం।
జంగలో జలనిర్ముక్త

**శంబళ**: న. ఇది ఒడ్డునకును, దారిబత్తెమునకును, పరశ్రేయమును సహించకుండుటకును పేరు.
**కందళ**: న. ఇది పుఱ్ఱెకును, సూర్యాదిగ్రహణమునకును, క్రొత్తమొలకకును, అవ్యక్తమధురధ్వనికిని, ఈ. స్త్రీ. జింకలలోనిభేదమునకును, వృక్షవిశేషమునకును పేరు.
**పింగళ**: పు. ఇది పింగళమునికిని, ఈశ్వరునకును, సూర్యుని పార్శ్వమందలి దేవతావిశేషమునకును, కుబేరుని నిధివిశేషమునకును, కోతికిని, అగ్నికిని, త్రి. పింగళవర్ణమైన దానికిని, స్త్రీ. తామరదుద్దునకును, వేశ్యకును, దక్షిణ దిగ్గజముయొక్క భార్యకును పేరు.
**జంగల**: పు. ఇది మరుభూమికిని, న. మాంసమున

